# PREFACE

Inspired by the publications of 'Vignana Chandrika Mandali' the author had, four years ago published a book in Telugu on 'Educational Psychology.' The appreciation and encouragement it has come in for prompted the author to publish this book in Telugu on the 'Principles of Education' to supply the long-felt need of the pupil-teachers in the Hyderabad State. The author's experience as a teacher for about eighteen years in the Hyderabad State and his service of about seven years in the Government Teachers' Training School at Warangal in particular, have enabled him to publish this book.

Care has been taken to arrange the material in such a way as to bring it in confirmity with the revised syllabuses framed by the Department of Education - Hyderabad. At the same time, every effort was made to make the book both popular and interesting. The author is deeply indebted to the works of outstanding educationists (as per list given at the end) which he has consulted in bringing out this book.

The difficulty in finding suitable technical terms in Telugu is there as ever. The author has made use of the terms already in vogue and coined the rest. Suggestions regarding better translation of technical terms will be gratefully received.

The author is indebted in no small measure to the kindness and solicitude shown by the late Sri P. V. Subba Rao, M A., L. T. then secretary of the H. S. C. Board, who just a fortnight before his sad demise had very kindly gone through the manuscript and offered his suggestions.

It is the very pleasant duty of the author to thank Sri K. Vedanthachary M. A. (London), Lecturer, Osmania Training College- Hyderabad, for the patience with which he had read the manuscript and offered his constructive criticism and valuable suggestions. In like manner the author is grateful to Sri C. Ramanadham B. A., Deputy Inspector of Schools, Warangal District, for the valuable help rendered in the preparation of the book. His thanks are also due to Sri D. V. Ramanacharyulu, Telugu pandit, for going through the manuscript and making the necessary corrections.

**THE AUTHOR.**

1st December 1950.

## BOOKS CONSULTED

1 'The principles of Education' by Raymont.

2. 'Principles and Methods of Teaching' by Welton.

3. 'Text - Book in the Principles of Education' by Henderson

4. 'The Aims of Education and other Essays' by A. N. Whitehead

5. 'Principles of Teaching' by W. M. Ryburn.

6. 'The Progressive School' by W. M. Ryburn.

7. 'The Indian Teachers' 'Guide' by P. Wren.

8. 'Instruction in Indian Secondary Schools' by Macnee

9. 'Matter And Method In Education' by Stuart and Oakden.

10. 'The Teaching of Mathematics in the New Education, by N. Kuppuswami Iyengar.

# విద్యామానసిక శాస్త్రము

గ్రంథకర్త

**సి. సూర్యనారాయణమూర్తి** M. Sc., Dip. Ed,

నవాబ్ మెహదియార్ జంగ్ గోల్డ్ మెడలిస్టు,

జిల్లా విద్యాశాఖాధికారి,

కరీంనగరము జిల్లా.

262 పుటలు, వెల 3-0-0 (పోస్టేజిగాక)

" పెక్కు పాశ్చాత్య గ్రంథాలను పరిశీలించి శ్రీ సూర్య నారాయణమూర్తి గారు తెలుగులో యీ గ్రంథాన్ని వ్రాసి ప్రకటించినందుల కెంతయు ప్రశంసాపాత్రులు ....... పిల్లల విద్యా గురువులేగాక, తల్లి దండ్రులు గూడ ఈ గ్రంథము శ్రద్ధతో మననం చెయ్యడం చాలా అవసరం. "

' కృష్ణా పత్రిక '

వలయువారు :

**సి. సూర్యనారాయణమూర్తి** M. Sc., Dip. Ed.,

జిల్లా విద్యాశాఖాధికారి,

కరీంనగరము జిల్లా,

Karimnagaram ( P. o. )

Via Kazipet. C. Rly.

# విషయసూచిక
# ( CONTENTS )

# విద్యాసూత్రములు

( Principles of Education )

## మొదటి అధ్యాయము

## విద్య ( Education )

విద్యయొక్క ప్రాముఖ్యతను గురించి వేరుగ చెప్ప నక్కరలేదు. ప్రతిదేశమునందును లక్షలకొలది ద్రవ్యము దీని కొరకై వెచ్చింపబడుచున్నది. సంఘములోనుండు దురాచారములను పోగొట్టుటకును, బీదవారిలో వివేకము కలిగించుటకును, అంటువ్యాధులు ప్రబలకుండ నాపుదలచేయుటకును ప్రభుత్వాధికారులు, సంఘనిర్మాతలు విద్యనే సాధనముగ గైకొనుచున్నారు. నిర్బంధ విద్యాశాసన మేర్పాటు చేయబడినది. వయోజనులకు విద్యగరపుటకు ప్రయత్నములు జరుగుచున్నవి ఈ విధముగా ఈ కాలమునందు అందరికి విద్య నభ్యసించుటకు తగిన సదుపాయములు కలిగింపబడుచున్నవి గాని విద్యగరపు ఉద్దేశమును గురించి అందరికి ఏకాభిప్రాయము లేదు. ప్రభుత్వోద్యోగుల ఉద్దేశము వ్యవసాయము, వ్యాపారము చేయువారి ఉద్దేశముతో సరిపడదు. ప్రతిమానవుడు తన యవసరముల ననుసరించి విద్యయొక్క ఉద్దేశ మేర్పరచుకొనుచున్నాడు. ఇట్టి పరిస్థితులలో విద్యగరపు ఉపాధ్యాయులు త్రోవ దొరకక

రేయుద్దేశము దృక్పథమునం దుంచుకొని బోధింపవలసినది తెలియక చికాకు చెందుచున్నారు. ఈ క్రింది ముఖ్యమైన ప్రశ్నలకు కచ్చితమైన సమాధానములను తెలిసికొనిననే గాని ఉపాధ్యాయుడు తన కర్తవ్యమును పూర్తిగా నెరవేర్ప జాలడు. విద్య అననేమి ? విద్యయొక్క యుద్దేశమేమి ? ప్రభుత్వము పాఠశాలలు ఎందుకు ఏర్పాటుచేసినది. బాలురను పాఠశాలలో చేర్చుటకై తల్లిదండ్రులను ప్రభుత్వమెందుకు నిర్బంధించుచున్నది ? సంఘము పాఠశాలనుండి యెట్టి ఫలితములను పొందగోరుచున్నది ? తల్లి తండ్రులు తమ బాలురకు పాఠశాలలవలన నెట్టి లాభములు కలుగునని తలంచుచున్నారు? ఇట్టి ప్రశ్నలకు తగుసమాధానములు పొందుటకై మొదలు మనము విద్య యన నేమియో తెలిసికొని తరువాత ఉపాధ్యాయుడు ఏ యుద్దేశము దృష్టియందుంచుకొని విద్యగరుపవలయునో చర్చించుదము.

<u>విద్యయన నేమి ? (The meaning of Education)</u>:- విద్య యనుపదము రెండర్థములిచ్చునట్లుగా నుపయోగింపబడుచున్నది. ఒకటి విశాలార్థము, రెండవది సంకుచితార్థము. విశాలార్థమున వ్యక్తి శైశవమునుండి యౌవనమువరకు వికాసము పొందు సరణినే ( Process to Development ) విద్య యందురు. ప్రతివ్యక్తి తన శైశవమునుండి యౌవనమువరకు వికాసము చెందునపుడు క్రమేణ తన భౌతిక,సాంఘిక పరిసరములకు తనను తగినట్లుగా చేసికొనుచుండును. అతనికి ఏయే వస్తువులతో సంబంధము కలుగుచుండునో వానిప్రభావము అతనిపై పడు

చుండును. ఇంతియేగాక అతని జీవితమునందు సంభవించు ప్రతిసంఘటనము అతనికి జ్ఞానము కలిగించుచుండును. ఉదా:— స్నేహితునితో మాటలాడుట, దేశమునందు పర్యటనము చేయుట, ఒక హరికథనుగాని లేకఉపన్యాసమునుగాని వినుట మొదలగునవి. ఇట్టి సంఘటనలవలన నతని కెంతయో అనుభవము జ్ఞానము కలుగుచుండును. విశాలార్థము గ్రైకొంటిమేని ఇది అంతయు విద్యయేయని చెప్పవచ్చును. కాని విద్య యను పదము సామాన్యముగ నిట్టి విశాలార్థము నిచ్చునట్లుగా ఉపయోగింపబడకసంకుచితార్థము నిచ్చునట్లుగా నుపయోగింపబడుచున్నది. ఒకవ్యక్తి తనపరిసరములనుండి కాకతాళీయముగా గ్రహించునట్టి జ్ఞానమును విద్యయనక ఉపాధ్యాయులుద్దేశపూర్వకముగ బాలురకు కలిగించుజ్ఞానము విద్య యనబడును. విద్యావేత్తలు, సంఘనిర్మాతలు, ప్రభుత్వాధికారులచే నియమింపబడిన ప్రణాళిక ననుసరించి ఉపాధ్యాయుడు మున్ముందుగా నొక పథకమేర్పరచుకొని దానికి తగినట్లుగా బాలురకు విషయములను బోధించును. ఇట్టి ఉద్దేశపూర్వకమైన బోధనయే విద్యయనబడును. ఇదియే సంకుచితార్థము. మనము ఇకముందు 'విద్య' యను పదము ఇట్టి సంకుచితార్థము నిచ్చునట్లుగానే యుపయోగించుదము.

## విద్యోద్దేశము (The Aim of Education.) :—

ఒక గృహనిర్మాణమునకై ఇటుకలు, సున్నము, కట్టెలు మొదలగు పరికరములను గూడబెట్టుటయేగాక కట్టబోవు ఇంటి ప్లానును గూడ ముందుగా సిద్ధపరచుకొను టెంత యవసరమో

అటులే ఉపాధ్యాయునికిగూడ విద్య గఱపుటకు ముందేయుద్దే శముతో విద్యగఱపవలయునో నిర్ణయించు కొనవలసియుండును. ఉద్దేశము నేర్పరచు కొనుటవలన చిట్టచివరకు మనము సాధింపబోవు విషయము దృష్టియందుండి, దానికి తగినట్లుగా కార్యమును కొనసాగించుచుందుము. ఈ విధముగ మనము జేయు పనియందు క్రమమార్గమునకు ఉద్దేశము మనలను తీసి కొని పోవుచుండును.

విద్యయొక్క ఉద్దేశ మిది యొక్కటియేయని రూఢిగా జెప్పుటకు వీలులేదు. ఇంతియేగాక విద్యయొక్క ఉద్దేశ మన్నికాలములందొకటియే యుండజాలదు. దేశకాలపరిస్థితులను బట్టి ఇదిగూడ మారుచుండును. విద్యావేత్తలు, తత్త్వజ్ఞానులు తమతమ యనుభవముల ననుసరించి విద్యోద్దేశములను వెలి బుచ్చినారు. 'డ్యూయి' (Dewy) అను విద్యావేత్త 'ఎత్తుగ నుండి' చుట్టుప్రక్కలనున్న దృశ్యములను బాగుగ జూచుటకు వీలును గలిగించునట్టి పర్వతశిఖరముతో 'విద్యోద్దేశమును బోల్చినాడు. ఆ పర్వత శిఖరమున నిలుచుండిన యెడల చుట్టు పక్కలనున్న దృశ్యము చక్కగా కానుపించును. అదే శిఖ రమున మఱియొక దిశయందు నిలుచుండి చూచినయెడల నా దృశ్యమే మఱొకవిధముగ కానుపించి మొదటిదానికన్న వేరుగా నుండును. కాని యీ రెండుదృశ్యము లొకదాని కొకటి వ్యతి రేకముగా నుండక ఒకదానిని మరొకటి పూర్తిజేయును. ఇదే విధముగ వివిధవిద్యావేత్తలు వెలిబుచ్చిన విద్యోద్దేశములందు వ్యత్యాసము లున్నప్పటికి అవన్నియు పరస్పర విరుద్ధములుగ

నుండక ఒకటి మరొకదాని కొరతను పూర్తిజేయుచుండును. కావున మనమింతవర కాచరణలోనున్న కొన్ని యుద్దేశములను చర్చించి ఇప్పుడేయుద్దేశమును మనము దృక్పథమున నుంచు కొవలయునో మనము విచారించుదము.

జీవనోపాధి గడించు ఉద్దేశ్యము. (Earning of livelihood) :— విద్య పూర్తి కాగానే మానవుని తన జీవనోపాధి గడించుటకు సమర్థునిగా జేయుటయే విద్యయొక్క ఉద్దేశమని సాధారణముగా నందరిచే భావింప బడుచున్నది. ప్రపంచమునందు వేనకువేలు విద్య నభ్యసించినవారు నిరుద్యోగులుగా నుండుటను బట్టిగూడ ఇదే ఉద్దేశము దృఢపడుచున్నది. సామాన్యముగ చాలమంది తల్లిదండ్రులు తమ పిల్లలను కేవల మీ యుద్దేశమును దృష్టియందుంచుకొనియే పాఠశాలలకు పంపుదురు. ఈ యుద్దేశమునందు స్పష్టత కానుపించుటయేగాక దీని ఫలితములుగూడ వాస్తవమైనవియు, ఆచరణీయమైనవియు గాను నుండును.

కాని కేవలము దీనినే విద్యయొక్క ముఖ్యోద్దేశముగా భావించుటకు వీలులేదు. ఎందువలన ననగా; ఈ యుద్దేశమునే దృష్టియందుంచుకొనినయెడల పాఠశాలయందు బోధించు విషయముల (Subjects) ప్రాముఖ్యత వానివలన లభించు ఉద్యోగములపై నాధారపడి యుండును. అనగా దేనిని జదివిన ఉదరపోషణ కవకాశ మెక్కువగలుగునో దానినే ప్రణాళిక యందు జేర్పవలసి యుండును. చరిత్రకన్న 'సంక్షిప్తలిపిని' (Short hand) కావ్యములకన్న పాకశాస్త్రమును నేర్చుకొను

టయే మంచిదిగా నెంచబడవచ్చును. ఇదేవిధముగా ప్రాథమిక పాఠశాలలందు చదువుట ( Reading ) వ్రాయుట ( Writing ) కొరకై వినియోగింపబడు కాలమును తోటపనియందుగాని, లేక కుట్టుపనియందుగాని గడపుట లాభకరమని తోచవచ్చును. ఈ యుద్దేశమునే దృష్టియం దుంచుకొనునెడల గత విషయము లను తెలుపు చరిత్రకు, మన సంస్కృతిని తేటతెల్లముగావించు సారస్వతమునకు, ప్రస్తుతకాలమందు మనజీవిత మెంత ఔన్నత్య దశకు జెందినదో నిరూపించు విజ్ఞానశాస్త్రము (Science)నకు ప్రణాళికయందు తావిచ్చుటకు వీలులేదు.

ఇంతియేగాక ఒక ప్రజాస్వామిక సంఘము (Democratic Society ) లో నొకపిల్లవాడు పెరిగి పెద్దవాడైన తరువాత తన జీవనోపాధి నెట్లు గడింపగలుగునో ఖండితముగ జెప్పుటకు వీలులేదు. బాల్యము నుండియు నొకవృత్తి కొరకై సిద్ధపరుపబడిన వానికి పెద్దవాడైన తరువాత నావృత్తియే తప్పక లభించునని చెప్పుట కవకాశములేదు.

ఇదియునుగాక పొట్టకూటికై పాటుపడుట మానవుని ముఖ్యావసరములలో నొకటిమాత్రమే అయి యున్నది. కాన దీనినే విద్యయొక్క సంపూర్ణోద్దేశముగా పరిగణించుట అసమంజసము.

ప్రతి వ్యక్తియు తన విరామకాలమును సద్వినియోగ పరచుటకు సమర్థుడై యుండవలయును. అట్టి సమర్థతను గలిగించుట కీఉద్దేశము తోడుపడదు. జీవనోపాధిని సమకూర్చు వృత్తియందే సదానిమగ్నుడై యుండి వేరేయే యభిరుచులు లేని

మానవుడు మానసికముగను, నైతికముగను హీనజీవనము గడుపుచుండును. ఇట్టి వ్యక్తివలన సంఘమున కెట్టి లాభము నుండదు. కావున నీ ఉద్దేశమునే విద్యయొక్క సంపూర్ణోద్దేశముగ భావించుటకు వీలులేదు. అయినను విద్యాగరపునపుడు దీనికి గూడ కొంత ప్రాముఖ్యత నిచ్చియే తీరవలయును.

జ్ఞానోద్దేశము (The knowledge aim) :— ఈ ఉద్దేశము పైన వివరింపబడిన ఉద్దేశమునకు పూర్తిగా విరుద్ధమైనది. దీనిని ఉపాధ్యాయులు మిథ్యాహేతువు (fallacy) అందురు. కేవలము జ్ఞానార్జనమే సరియైన యుద్దేశమని ఉపాధ్యాయుడు భావించును. ప్రాపంచిక విషయములం దెట్టి యనుభవమును గలుగజేయక పరీక్షలయం దుత్తీర్ణులుగా జేయుటయే ఉపాధ్యాయులు తమ కర్తవ్యముగా భావింతురు. పరీక్షల కెక్కువ ప్రాముఖ్యత నిచ్చుటవలన నీయభిప్రాయము మరింత దృఢపడినది. ఈ పరీక్షలు వల్లించినవిషయములనే తప్ప తదితరములను పరీక్షింపజాలవు. ఇంతియేగాక పరీక్షలం దుత్తమతరగతులలో నుత్తీర్ణులైనవారికి బహుమతులియ్యబడుటచే నీ యుద్దేశమునకు మరింత విలువ హెచ్చినది. ప్రాపంచికానుభవమునకు తావియ్యక కేవలము విశేష విషయజ్ఞాన సంపాదనమే విద్యయొక్క సరియైన దృక్పథము కాదు. ఈ యుద్దేశముకూడ అసంపూర్తిగానే యున్నది. కావున నిదిగూడ సంతృప్తికరముగ లేదు.

సంపూర్ణజీవితమున సిద్ధపరచు ఉద్దేశము (Preparation for complete living) :— ఈ యుద్దేశము హెర్బర్టు స్పెన్సరు, (Herbert Spencer) అను విద్యావేత్తచే ప్రతి

పాదింపబడినది. బాలురను సంపూర్ణజీవితమునకు సిద్ధపరచు టయే విద్యోద్దేశమని స్పెన్సరు చెప్పెను. అట్టి జీవితము లభింప జేయుటకై ఈ క్రింద నుదహరింపబడిన విషయములందు దగు సమర్థత గలుగునట్లు జేయవలయునని నుడివెను. (1) ఆత్మసంరక్షణ (2) జీవిత సాధారణావసరములు, (3) కుటుంబపోషణ, (4) సాంఘికసంబంధములు, (5)విరామకాలమును సద్వినియోగపరచు సాధనములు.

దీనియందు విద్యకొరకై యేర్పాటుజేయబడిన యుద్దేశములు చాలవర కిమిడి యున్నవి. కాని ఏ విధమైన ప్రమాణము ( standard ) లేక మనము జీవితము సంపూర్ణమైనది, లేనిది తెలిసికొనజాలము. ఇట్టి ప్రమాణ మేదియు నేర్పాటు జేయబడలేదు. ఇంతియేగాక ప్రణాళికయం దేవిషయముల ( subjects ) ను సమకూర్చిన నిది లభించునో విశదీకరింపబడ లేదు. దీనియందు కేవలము బాలుని బాహ్యాపరిసరములకు సంబంధించిన శాఖలే తీసికొనబడినవిగాని అతని మానసిక శిక్షణమునకు దగిన యవకాశములు గల్పింపబడలేదు. ఈ కారణముల వలన నీ యుద్దేశముగూడ అంత తృప్తికరముగ తోచదు.

<u>నైతికోద్దేశము ( The moral aim )</u> :— ఈ యుద్దేశమును హెర్బార్టు ( Herbert ) అను విద్యావేత్త వెలిబుచ్చెను. మానవునియందుగల దుష్టప్రేరణములను ఉన్నతాదర్శములతో జయింప గలుగుటయే విద్యయని ఇతడు నుడివెను. మానవుడు పుట్టుకతోడనే నీతివంతుడై యుండడు. అతనియందుద్భవించుఅవినీతికరమైన ప్రవృత్తులు ఉన్నతాదర్శములతో

గూడిన సంకల్పములచే నణచివేయబడును. ఇట్టి ఉన్నతాదర్శములను సమకూర్చుటయే విద్యయొక్క ముఖ్యకర్తవ్యము. ఈ అభిప్రాయములే 'సత్సంకల్పము' (Good will)నకు మూలకారణము. ఈ సంకల్పమే మనలను నీతివంతులనుగా జేయును. కాన నైతిక భావన (Moral Concept) యందే విద్యయొక్క యుద్దేశమంతయు నిమిడి యున్నదని హెర్బార్టు చెప్పెను.

నైతికోద్దేశము చాల యున్నతోద్దేశమే కాని ఇదిగూడ మానవుని జీవితములోని ఒక ప్రత్యేక భాగమునకు సంబంధించినదే. ఒకవ్యక్తి నీతివంతుడై యుండవచ్చునుగాని ఎక్కువ మేధావిగాని లేక బలాఢ్యుడుగాని యై ఉండకపోవచ్చును. సంఘమునకు లాభదాయకమగు నేకార్యమునందతడు పాల్గొనలేక పోవచ్చును. నిజముగా నాలోచించిన నొక విద్యావంతుడు కేవలము తాను అభివృద్ధి జెందుటయేగాక తానే సంఘమునకు జెందియున్నాడో ఆ సంఘము నభివృద్ధి పరచుటకై తన చేతనైనంత కృషి జేయుటకు సమర్థుడుగా నుండవలయును. ఇట్టి సమర్థత నీయుద్దేశము కల్పింపజాలదు.

దీనికి మరియొక యాక్షేపణ యేమనగా, మనపాఠశాలలోని కాలమునంతయు సత్యము, యోగ్యత, విధేయత మొదలగువాని నుపదేశించుటయందే వినియోగించిన నీతిని గురించి బోధింపనట్టి విజ్ఞానశాస్త్రము (Science), గణితము మొదలగు విషయములను ప్రణాళికలో చేర్చుటకు వీలుండదు. కాని వీనిని గూడ చేర్చుట అత్యవసరము.

ఉపాధ్యాయుడు విజ్ఞానశాస్త్రము (Science) గాని లేక చిత్రలేఖన (Drawing) పాఠమునుగాని, బోధించునపు డావిషయమును (Subject) దృష్టియందుంచుకొని బోధించిన బోధన ఫలవంతముగా నుండును. కాని నైతికోద్దేశమును దృష్టియందుంచుకొని బోధించినచో సరియైన బోధన కవకాశ ముండదు.

సాంఘికోద్దేశము (The Social aim):- సాధారణముగా ప్రతిమానవునకు సాంఘికజీవన మత్యావసరము. సంఘమునుండి వేరుపరుపబడిన వ్యక్తి నిస్సహాయుడుగా నెంచబడును. కాబట్టి అతడు బాహ్యప్రపంచముతో నెట్టిసంబంధమును గలిగించు కొనునో దానిమీదనే అతని అభివృద్ధి ఆధారపడి యుండును. ఒకవ్యక్తి సమాజములోనుండి ఇతరులపై ఎట్టి భారమును వేయక తన యవసరములను పూర్తి జేసికొనుచు ఇతరుల కెట్టి యాటంకములను గలిగింపక వారి హక్కులను గాపాడుచు సమాజముయొక్క సర్వతోముఖాభివృద్ధికి సాధ్యమైనంతవరకు కృషి జేయ గలుగుటయే సాంఘికోద్దేశము. దీనిని బట్టియే ప్రొఫెసరు డ్యూయీ, క్లేపరు బాగ్లే మొదలగు విద్యావేత్తలు విద్యగరపు ఉద్దేశము సాంఘికోద్దేశమై యుండవలయునని తెలిపియున్నారు.

ఈ యుద్దేశము ఉత్తమ మైనదని భావింపవచ్చును. ఎందువలన నన, ఇది సంఘమునకు లాభదాయకమగు వ్యక్తు లను సిద్ధపరచుటకై ప్రయత్నించుచు,వ్యక్తియందు తన యవసర ములను దానేపూర్తిజేసికొను సమర్థతనుగూడ కల్పించుచున్నది.

ఈ యుద్దేశమునందుకూడ కొన్ని లోపములు లేకపో లేదు. సామాన్యముగ నిత్యజీవితమునందు దీనిలో గనబరచి నంతగా సంఘమునకు వ్యక్తి లోబడి యుండజాలడు. ఇంతియేగాక వ్యక్తి క్రమేణ కుటుంబము, కులము, తెగ మొదలగు వానికి దాసుడుగా నుండక వాని బంధములనుండి విముక్తుడగుటకు ప్రయత్నించుచున్నట్లుగా మనకు దేశచరిత్రలు తెలుపుచున్నవి.

సాంఘికోద్దేశముగూడ మానవుని జీవితముయొక్క కేవలము ఒక ప్రత్యేక యవస్థను గురించియే తెలుపుచున్నది. మానవునకు చేతనాచేతన ( animate and inanimate ) ప్రకృతితోగూడ సంబంధము గలిగి యుండవలెను. వీనిని బాగుగ నర్థము జేసికొనవలయు ననిన విజ్ఞాన శాస్త్రము (Science), ప్రకృతిపఠనము ( Nature Study ) ను బాగుగ నెరింగియుండవలసి యుండును. ఇదే విద్యగరపు ఉద్దేశ్యమైన ప్రణాళికయందు వానికి స్థానము దొరుకదు.

జీవితానుగుణ్యోద్దేశము ( Adjustment to Life ) ప్రపంచమునందు తన పరిసరములకు తనను అనుకూల పరచుకొనగలుగు సజీవమే ( Organism ) జీవింపగలుగును. కావున ఇట్టి అనుగుణ్యమే (adjustment) జీవితముయొక్క ముఖ్య సూత్రమని చెప్పవచ్చును. జంతువులు, మానవులు, మొదలగు ప్రాణులన్నియును తమ జీవితమును గడపుకొనుటకై పరిసరములతో సరిపుచ్చుకొనుచుండును. ఉదా:- చిఱుతపులి, పెద్దపులి, సీతాకోకచిలుక, చిలుక మొదలగునవి తమ శారీరక

వర్ణములచే పరిసరములకు తగినట్లుండి, తమను రక్షించుకొన గలుగుచున్నవి. ఒంటెపాదములు, దాని పొట్టయందుండు సంచి ఎడారి ప్రయాణమునకు తగినట్లుగా వృద్ధి పొందుచుండును. ఈ పై దృష్టాంతము లన్నిటిలోను పరిసరానుగుణ్యాము, శారీరక స్థితికి సంబంధించి యున్నదిగాని మానవుడు సరిపుచ్చుకొను పరిస్థితి మానసికావస్థకు సంబంధించి యుండును. చెట్లనుండి ఆహారము పొందుటకై దుప్పికి పొడవగుమెడ, ఏనుగునకు తొండము, కోతికి చెట్టుపై కెగబ్రాకుశక్తి, ప్రకృతిచే గల్పింప బడుచుండును. కాని మానవుడు నిచ్చెన, గొడ్డలి మొదలగు సాధనము లుపయోగించి తనఆహారమును సంపాదించుకొనును. గనుక మానవుని తన పరిసరములతో సరిపుచ్చునట్టిది అతని బుద్ధిబలమే. ప్రకృతియే జంతువులను తమ పరిసరములకు సరి పుచ్చుకొనునట్లు జేయును. కాని మానవుడు తన పరిసరములను దానే కల్పించుకొనును. అనగా మానవుడు ప్రకృతితో తనను సరిపుచ్చుకొనక ప్రకృతినే తన అవసరములకు తగినట్లుగా మార్చుకొనుచుండును. ఉదా॥ వేడిప్రదేశములను చల్లగను, చల్లని ప్రదేశములను వేడిగను అతడు మార్చుకొనును. ఈ విధ ముగ మానవుడు తన పరిసరములను వశపరచుకొని, తనకు దగిన పరిసరములను కల్పించుకొని జీవితము గడపుకొను చుండును.

ఆతని జీవితమునందలి కార్యము కేవలము భౌతికజీవ నముపై నాధారపడి యుండదు. శరీర సంబంధమగు కోరి కలను పూర్తిజేయుట అతని జీవితముయొక్క స్వల్పభాగ

మని చెప్పవచ్చును. ఇంతియేగాక అతనికి మానసిక, సాంఘిక, నైతిక, జీవనమునకు తోడ్పడు అవసరములను పూర్తిచేసికొన వలసియుండును. నివసంచుటకు ఇల్లుమాత్రమే కోరక సౌఖ్య దాయకమగు నొకమేడను గోరును. ధరించుటకు బట్టగాక మంచి దుస్తులకై కాంక్షించును. ఇదేవిధముగ సైన్సు, సారస్వతము మొదలగు విషయములను (Subjects) కేవలము ప్రయోజన మూల్యము (utilitarian value) దృష్టియందుంచుకొనియే చదువక నూతనజ్ఞాన సంపాదనకొరకు సైన్సును, సంతోషమును గలిగించుటకై సారస్వతమును పఠించును. దీనినిబట్టి తేలిన సారాంశ మేమన మానవుడు తన పరిసరములకు తనను సరి పుచ్చుకొనుట ఎక్కువ మానసికశక్తికే సంబంధించియుండును.

మానవుని తన సంశ్లిష్ట జీవితమునకు సంసిద్ధుని చేయు టకే అతని శైశవదశ చాల పొడుగింపబడినది. ఈ జీవశాస్త్ర దృక్పథము ( Biological View point ) ననుసరించియే మాన వుని అతని పరిసరములకు దగినట్లు జేయుటకై శిక్షణ మివ్వ వలసి యుండును. విద్యవలననే ఇట్టిశిక్షణము లభ్య మగును. కాబట్టి పరిసరములకు సరిపుచ్చుకొనునట్లు జేయుటయే విద్య యొక్క ముఖ్యోద్దేశమని చెప్పవచ్చును.

ఇందువలననే 'విద్యార్థిని' ఆతని ప్రస్తుత భావిజీవితము లతో సరిపడునట్లు జేయుటయే విద్యోద్దేశమని రూడిగరు ( Ruediger ) అను విద్యావేత్త చెప్పెను. ఈ ఉద్దేశ మిదివరకు చెప్పబడిన వానికన్న శ్రేష్ఠమైనదిగా భావింప వచ్చును. ఎందు వలన ననగా ఈ ఉద్దేశమందు విద్యార్థిని తన జీవితమునకు సరి

పడునట్లు చేయుటకై అతని మానసిక, శారీరక, సాంఘిక, నైతిక శక్తులను వృద్ధిపరచుటయేగాక తన పరిసరములనుగూడ బాగుగ తెలిసికొనుట కతనిని సమర్థునిగా జేయవలసియుండును. ఇంతియు గాక మానవుని జీవితములో నుండు ముఖ్యలక్షణము లన్నింటినిగూడ గనిపెట్టి విద్య గరపవలసియుండును. మానవుని ప్రస్తుత భావిజీవితమునకు సరిపడునట్లు చేయుచు అతని మానసిక శారీరక, సాంఘిక, నైతిక శక్తులను పెంపుచేయుచు పరిసరముః లను గూడ బాగుగ గ్రహించి వానిని వశపరచుకొని అవి తనకు తోడ్పడునట్లు చేసికొనుటయేగాక నే వృత్తియందైన మంచి జ్ఞానమును సంపాదించి జీవనాధారము నార్జించుటకు సమర్థునిగ జేయుటయే విద్యయొక్క ఉద్దేశమని రూడిగరు ( Ruediger ) విశదపరచెను.

ఇంతవరకు విద్యయొక్క వివిధోద్దేశములను విపులముగా పరిశీలించితిమి. ఏ యొక ఉద్దేశమును ముఖ్యమైనదని నిర్ణయించుట సమంజస మనిపింపదు. ఏలయన వివిధోద్దేశములు విరుద్ధముగా కానుపించినను సంపూర్ణ విద్యలో నివియన్నియు ఇమిడి యుండవలయును. కొందరు మేధావంతులు విద్యయొక్క ముఖ్యోద్దేశ మిదమిత్థమని నిశ్చయించినను ఉపాధ్యాయ వర్గము వారు రూఢిగరు నిర్ణయించిన 'జీవితానుగుణోద్దేశమునే' తమ దృష్టియందుంచుకొని విద్యను గరపిన నది సంపూర్ణవిద్యకు తోడ్పడును. ఇట్టి సంపూర్ణవిద్య మానవుని జీవితాభివృద్ధి సర్వ విధముల సహాకరించుచు, వానిని బుద్ధిమంతుడుగను,నీతిమంతుడుగను, సంఘోపకారిగను, తనపరిసరముల కనుకూలించు వానిగను జేయునని నిస్సందేహముగ జెప్పవచ్చును.

# రెండవ అధ్యాయము

## విద్యాసంస్థలు (Educational Agencies)

విద్యయన నేమియో తెలిసికొని, ఏయుద్దేశమును దృష్టి యందుంచుకొని విద్యను గరపవలయునో విచారించితిమి. ఇపుడు విద్యగరపు కర్తృత్వము ఉపాధ్యాయునిచే గాక ఇంకెవరిచేకూడ నిర్వహింపబడుచున్నదా యనునది తెలిసి కొందము.

బాలుడు ఇంటిలో తన తలిదండ్రులు, అక్క-చెల్లెండ్రు, ఇతర బంధువులు మొదలగు వారితో సహచరించి వారిని బాగుగా తెలిసికొను చుండును. పాఠశాలయందు ఉపాధ్యాయులతోను తన సహచరులతోను సన్నిహిత సంబంధము గలిగి మెలగుచుండును. ఇంతియేగాక ప్రభుత్వముద్వారా వివిధ నిబంధనలను చట్టములను తెలిసికొని తనకుగల హక్కులను ఇతరులకు గల హక్కులను నెరుంగుటయే గాక ఇతర దేశస్థులతో గూడ వ్యవహరించుటకు మొదలిడును. విద్య పూర్తికాగానే తనజీవనోపాధి గడించుట కే వృత్తినవలంభించునో ఆ వృత్తియందుతనతో పాటు పనిచేయు ఇతరవ్యక్తులతో సంబంధము కలిగించుకొనును. ఇదియునుగాక మతముద్వారా సృష్టికర్తను గురించి తెలిసికొన ప్రయత్నించుచు నాతని సృష్టియందు గల చిత్రవిచిత్రములను తెలిసికొని సమస్త జీవరాసులకు తనకుగల సంబంధమును గ్రహించును. కాన గృహము, పాఠశాల, ప్రభుత్వము,వృత్తి,

మతము అను నీ అయిదు సంస్థలే బాలునకు విద్యాగరపు ముఖ్య సంస్థలని చెప్పవచ్చును. పైన నుదహరింపబడిన ప్రతిసంస్థయు విద్యాగరపు కర్తవ్య మెటుల నెరవేర్చునో విపులముగ చర్చించుదము.

(1) గృహము:—శిశుపోషణ, శిక్షణమునందు గృహ కర్తవ్యమును గురించి విద్యావేత్తలు వేరువేరు అభిప్రాయములను వెలిబుచ్చిరి. బాలుని శిక్షణమునందు కుటుంబ జీవితమునకు గ్రీసుదేశస్థులు చాల తక్కువ స్థానమిచ్చిరి. ఆకాలమునందు వారు స్త్రీలను చాల హీనముగ భావించి సంఘమునందు వారికి తక్కువస్థాన మిచ్చుటయే దీనికి కారణము. జాన్‌లాకు (John Locke) అను విద్యావేత్త భాగ్యవంతులగు పిల్లలను దృష్టియందుంచుకొని తన అసౌఖ్యమగు పాఠశాల జీవితమును జ్ఞప్తికి తెచ్చుకొనియును, పబ్లికుపాఠశాలలకు బాలురను పంపుట కన్న ఇంటియందు ప్రత్యేకోపాధ్యాయుని (private tutor) చేత విద్యగరపించుటయే చాల ఉత్తమ మని చెప్పెను. కుటుంబ సంస్థయం దెట్టినమ్మక ముంచక, రూసోయను విద్యావేత్త తన ఎమిల్ (Emile) ను ఒక అనాథశిశువుగా భావించి అతని గురువున్నే మాతాపితరులకు సంబంధించిన విధులన్నియు నెరవేర్చుటకై నియమించెను. కాని పెస్టాలజీ మాత్రము శిశుశిక్షణమందు గృహమునకు స్థానము తప్పక యియ్యవలసి యుండునని వక్కాణించుచు వాస్తవమైన విద్యకు ఉత్పత్తి స్థానము, మూలాధారము తల్లియే అని నుడివెను. ఈ సిద్ధాంత మునే నిత డెక్కువగా ప్రబోధించెను.

నిజముగా నాలోచించిన శిశు శిక్షణమునందు గృహ ప్రాముఖ్య మింతయని చెప్పుటకు వీలులేదు. ఇద్దరు బాలురొకే పాఠశాలయందు ఒకే ఉపాధ్యాయునివద్ద ఒకే విషయముల నభ్యసింపవచ్చును. వారి సామాన్య జ్ఞానమునందును, వారి అభిరుచులందును వారి భాషానైతిక స్థితులందును వారేగృహ మునుండి వత్తురో వారి కనుగుణముగ భేదములు గలిగియుం డును. గృహప్రభావము వ్యతిరేకముగా నున్నయెడల పాఠశాల ఆ బాలుని సక్రమ మార్గమునకు తీసికొనిపోవుట దుస్తరమని జెప్పవచ్చును.

లేబాల్యమునందు కుటుంబమే శిశువునకు సంపూర్ణ మైన పరిసరముగా నుండును. అతడు పాఠశాలకు పోవుట మొదలిడగానే అతని సాంఘికసంబంధములు విస్తరించి అతడు ఇతరులతో స్నేహమును కుదుర్చుకొనును. కాని చాలసంవత్సరముల వరకు గృహప్రభావమే ఎక్కువ ప్రాబల్యము గలిగియుండును. సామాన్యముగ గృహజీవితము వలననే యతనియందు సానుభూతి, విధేయత, దానము, మర్యాద, న్యాయము, ఆత్మగౌరవము మొదలగు మంచిలక్షణములు పెంపొందును. గృహమందే బాలుడు ఔదార్య నీచత్వములకు, న్యాయాన్యాయములకు, కృషి సోమరితనములకు గల భేదమును గ్రహించును. ఇచ్చటనే తనఅలవాటులకు దాసుడై ఏదియో యొకదానివైపునకు మ్రొగ్గును. గృహమునందే అతడు మాటలాడుట నేర్చుకొని భాషాజ్ఞానము నెక్కువగాగాని, లేక కొలదిగ గాని సంపాదించును. ఈ జ్ఞానమును బట్టియే అతనియందు విశాలసంకుచిత

భావము లేర్పడును. గృహమునం దిట్లేర్పడిన భావములే అతని యౌవనదశయం దెక్కువ ప్రాబల్యము గలిగియుండి క్రమేణా కొన్నితగ్గిపోవచ్చును. కాని కొన్నిభావము లట్లు తగ్గక జీవితము నందంతయు నిలిచియుండును. గృహమువలన ప్రాప్తించిన నీ విద్యా ప్రభావము వలననే సంఘమునందు సధర్మమార్గ మేర్పడును. కొందరు తమబాలురను పసితనమందే ఇంటినుండి తొలగించి విద్యాగరపు సంస్థలందు ప్రవేశపెట్టుట ఉత్తమ మని తలంచెదరు. గాని నిజముగా నాలోచించిన అట్లుచేయుట పొరబాటు. అందువలన బాలుడు పైనుదహరింపబడిన గృహపరిసర మహిమలను నెరుంగక కోల్పోవును.

బాలుని భావములన్నియు అతని కుటుంబ సాంప్రదాయములకు, ఆచారముల కనుగుణ్యములై యుండును. శిశు విద్యయందు శిక్షణమునకే ఎక్కువ ప్రాముఖ్యత గలదు. గృహవాతావరణము ఒక విద్యాసంస్థయని చెప్పవచ్చును. ఇది బాగుగ లేకుండిన నొక తెలివిగల శిశుజీవితము నిర్భాగ్యమైనదిగను ఒక సామాన్యమైన శిశువుజీవితము ఇది బాగుగనున్న యెడల జయప్రదముగను మారుట కవకాశముగలదు. కావున బాలునకు విద్యగరపునట్టి ప్రథమసంస్థ గృహమే. ఇందు తల్లికే ఎక్కువ ప్రాముఖ్యత యియ్యబడుచున్నది.

2. పాఠశాల:— కేవలము ఇంటి నాలుగు గోడల మధ్యనే బాలుడు విద్య నభ్యసించిన ఆతనికి సంకుచిత దృక్పథ మేర్పడును. ప్రతి శిశువు సంఘమునకు జెందిన నొకవ్యక్తియే. అట్టి వ్యక్తులందరు పెరిగి పెద్దవారై విశాల ప్రపంచమునందు

తమ భావిజీవితమును జయప్రదముగ గడుపుకొనవలయుననిన వారి దృక్పథము విశాలమైనదిగ నుండవలయును. అన్నలను చెల్లెండ్రను మాత్రమే ప్రేమించుకొని వారికొరకే త్యాగము చేయుట మనకు చాలదు. అట్లుగాక మన దేశస్థులు కష్టముల పాలైనపుడు ఆ కష్టములలో సాధ్యమైనంతవరకు పాల్గొని సానుభూతి కనుపరచుటగూడ మనకు కర్తవ్యము. ఈ విధముగ నితరులతో సహకరించుట, సర్వసామాన్య భ్రాతృత్వ భావమును, పెంపొందించుట మొదలగునవి గృహమందు చూపబడు ప్రేమ స్వార్థత్యాగముకన్న నెక్కువ ఘనత జెందినవి. గృహ వాతావరణమునందే బంధింపబడిన బాలుని సహజశక్తులు నిరోధింపబడుటచే నతని సానుభూతి దృక్పథము చాల సంకుచితములై యుండును. ఈ కారణము వలననే బాలుని పాఠశాలకు పంపుట అత్యవసరము.

బాలునికి మంచి వాతావరణము కల్పించి అతని నొకేసారి క్లిష్టపరిస్థితులతో నిండియున్న సంఘ జీవితమునందు దింపక క్రమేణ అతనిని భావిజీవితమునందు గడుపబోవు సాంఘిక జీవనమునకు మంచి పాఠశాల ఆతనికై సిద్ధముచేయును. కాబట్టి సంపూర్ణ గృహజీవితమునకు జెందిన ప్రథమ బాల్యదశకును, తలిదండ్రులతో సంబంధము వదలిన తరువాత యువకుడు గడుపవలసిన విశాల జీవితమునకును, పాఠశాలయే మాధ్యమిక సంస్థయని రేమంటు (Raymont) అను విద్యావేత్త చెప్పియున్నాడు. పాఠశాలయందే భావిజీవితమునందు కఠిన సమస్య

లను పరిష్కరించుటకు తోడ్పడు వివిధ రసములు (Sentiments) ఉద్భవింప జేయబడును.

సంఘ నిర్మాణమునందు పాఠశాలబోధనా కర్తవ్యమును నిర్వహించుచున్నది. తమ బాలురకు బోధించుటకు కావలసినంత విరామము, జ్ఞానము సాధారణముగా తలిదండ్రుల కుండదు. గావున పాఠశాలయందు ఉపాధ్యాయుడే వారికి ప్రతినిధిగా నుండి విద్యగరపును. అట్టి ఉపాధ్యాయునకు తలిదండ్రుల సహాకార ముండిననేగాని అతనికృషి ఫలవంతము గాజాలదు.

ప్రపంచికానుభవములను సులభ శైలిలో బాలురకు దెలుపుచు వారికి ప్రపంచములోని వివిధ విషయములు సులభముగా నర్థమగునట్లు పాఠశాల జేయును. ఇంతియేగాక ముఖ్యముగా బాలుర శిక్షణమున కుపకరించు ననుభవములనే ఎన్నుకొని వానినే క్రమపద్ధతిలో బోధించుట కేర్పాటు పాఠశాలయందే జేయబడును. ఇట్టి పాఠశాలయందే వివిధ శాస్త్రములు నేర్చుకొనుటకై బాలుర కవకాశములు నెలకొల్ప వీలగును.

పాఠశాలయే విద్యావేత్తలందరిచే బాగుగా నాలోచింపబడి సంఘోద్ధరణకై నేర్పరుప బడిన ప్రణాళిక యందలి విషయములను బాలురకు బోధించుటకు వీలొసంగును.

బాలుని పరిసరములందు సమత్వ మేర్పరచుట కెక్కువగా తోడ్పడునది పాఠశాలయే. సామాన్యముగ ఏ పరిసరములలో పెరిగిన బాలుడైనను ఆ పరిసరములకే అలవాటుపడి తదితర పరిసరఫలితములను తెలిసికొనజాలడు. వివిధ పరిసరములందు పెరిగిన బాలురందరు పాఠశాలయం దొకచోట కలియు

దురు. వీరందరును ప్రతిదినము కొంతకాలము కలసి మెలసి యుందురు, గావున నొకరిసంగతి మరియొకరు తెలిసికొను చుందురు. ఇట్టి అవకాశమే లభింపనిచో బాలుడు సంకుచిత పరిసరములకు లోబడి చెడిపోవుటకూడ సంభవింప వచ్చును. కావున పాఠశాలయే బాలురయందు శాంతి, సమత్వము, ఓర్పు, ఔదార్యములు కలుగ జేయును. ఇట్టి శిక్షణము వలన బాలుర తమ భావిజీవితమును బాగుగ గడుపుకొన సమర్థు లగుదురు.

ఒక బాలుడు మంచిపౌరుడగుటకై అతనికి కొన్ని ముఖ్య విషయములందు జ్ఞాన ముండితీరవలయును. పంచాయతీవిధానము, జిల్లాబోర్డులు, సహకార సంఘములు, ఆరోగ్యశాఖ, న్యాయస్థానము మొదలగు సంస్థలకుజెందిన జ్ఞాన మతని కుండి తీరవలయును. పాఠశాలయందట్టి జ్ఞానము సమకూర్చబడుటయే గాక స్వపరిపాలనా పద్ధతు లేర్పాటుజేయబడి బాలురకు కొంత వరకు శిక్షణముగూడ గరపబడుచున్నది. ఎట్లన పాఠశాలయందు విద్యార్థిసంఘ మేర్పరచుటకై కొన్ని నిబంధన లేర్పాటు చేయుట, ఆ సంఘముద్వారా పాఠశాల యాదలి వివిధ కార్యము లందు సహకరించుట మొదలగు భావిజీవితమునం దతడు నిర్వహింపవలసిన కొన్ని పౌరధర్మములయందు తగిన శిక్షణమియ్యబడును. ఈ విధమిగ పాఠశాల బాలునకు సంఘము తోను, దేశముతోను, తదుపరి ప్రపంచముతోను సంబంధ మేర్పాటు జేయుచున్నది.

ఇదియునుగాక ప్రభుత్వము బాలురపై తన ప్రభావము ప్రసరింపజేయుటకు పాఠశాలయే ముఖ్యాంగమని చెప్ప

వచ్చును. ఏయుద్దేశములను దృష్టియందుంచుకొని ప్రభుత్వము భావిపౌరులు గాబోవుచున్న పసిబాలురకు విద్యగరపుచున్నదో ఆ యుద్దేశములను సాధించుటయందు ప్రభుత్వమునకు పాఠశాలయే సహకరించును, ఈ విధముగ పాఠశాల కుటుంబమందలి ప్రత్యేకవ్యక్తికిగల హక్కులకు ప్రభుత్వమందలి సాంఘిక యోగ్యతల (Claimes)కు మధ్యవర్తిగను, సామరస్యము కుదుర్చు స్థానముగను పనిజేయును.

కావుననే పాఠశాల ఒక ముఖ్య విద్యాసంస్థయని తేటతెల్లమగుచున్నది. అది బాలురకు తగిన శిక్షణమిచ్చుటయే తన ప్రధాన కర్తవ్యముగా భావించును. పాఠశాల కార్యక్రమమంతయు కేవల మీయుద్దేశముపైననే ఏర్పాటు చేయబడును.

పాఠశాలలో బోధింపబడు ప్రణాళికవలనను, జ్ఞానవంతులైన ఉపాధ్యాయుల సత్సాంగత్యము వలనను, ప్రణాళికలోని తదితర విషయముల ప్రాబల్యము వలనను సంకుచిత పరిసరములలో బాలుర కలవడిన దురభ్యాసములు తొలగి సత్స్వభావ సదభ్యాసము లేర్పడును. కాబట్టి విద్యగరపుటలో పాఠశాలకు గల ప్రాముఖ్యత తదితర సంస్థలకన్న నెక్కువగా నుండుట తేటతెల్ల మగుచున్నది.

3. ప్రభుత్వము: ( State ):— ప్రభుత్వమువలన వ్యక్తి తన దేశమందలి చట్టములు, రాజకీయ విధానములను తెలిసికొని తానెట్లు మెలగవలయునో నిర్ణయించుకొనును. అతనికి ప్రభుత్వము తనకుగల హక్కులను ఇతరులకు గల హక్కులను తెలుపుటయేగాక సంఘమునం దతనికిగల స్థానమును గ్రహించునట్లు

చేయును. ఇదియుంగాక అతనికి పౌరవిధులను, తన దేశమునకు, ఇతర దేశములకు గల సంబంధములను విశదపరచును. ఈ జ్ఞాన సాహాయ్యముననే ఒకవ్యక్తి యితర దేశములతో రాజకీయ, వాణిజ్య, వ్యావహారిక సంబంధముల నేర్పరచుకొనఁ సమర్థుడగును. ఈ విధముగ ప్రతివ్యక్తికి రాజకీయ జ్ఞానము ప్రభుత్వము వలన లభించును గాన ప్రభుత్వముకూడ నొక ముఖ్య విద్యాసంస్థగా పరిగణింప బడుచున్నది.

మంచి యోగ్యతాపత్రములను పొంది నిపుణులుకాని మిడిమిడి జ్ఞానముగల వైద్యులుతమ వైద్యముచే ప్రజాక్షేమమునకు భంగము కలిగింతురు. అనారోగ్యకరమగు నాహారపదార్థములను విక్రయించు వర్తకులు ప్రజారోగ్యమునకు హానికలిగింతురు. గనుకనే అనర్హులగు వైద్యులను, మోసగించు వర్తకులను ప్రభుత్వము అరికట్టుచున్నది. ఇదేవిధముగా సక్రమ విద్యగరుపనట్టి సొంతపాఠశాలలు (Private Schools) ప్రజాక్షేమమునకు అనర్థదాయకములగుటచే ప్రభుత్వము వానిని గూడ నిరోధించుచు, క్రమపద్ధతులపై వయోజన, శిశువిద్యావిధానములను నడపించుటయందు జోక్యము కలిగించుకొనుచున్నది.

ప్రభుత్వము మంచి యంత్రసముదాయము (Machinery) మాత్రమే నేర్పాటు చేయఁగలుగును కాని ఆ యంత్రములు మంచి నేర్పరి చేతిలో నుంచకున్న సిద్ధపరుపబడు వస్తువులు బాగుగ నుండవు. విద్యావిధానముయొక్క కీలకము ఉపాధ్యాయుని మూర్తిత్వమే. విద్య యిటుకలు, సున్నము నందు గాని, కాగితముపైాద వ్రాయబడిన ప్రణాళికలందు గాని,

యంత్రములపై గాని యాధారపడి యుండక, బాలుర శిక్షణము నకై నియోగింపబడు విద్యావంతులగు స్త్రీ, పురుషుల నిపుణత, ప్రభావముల మీదనే ఆధారపడి యుండును. తన పనియందు శ్రద్ధాశక్తులు గల ఉపాధ్యాయుడు తగు వసతులు లేకున్నను, తనవిధిని సక్రమముగ నెరవేర్చును. తన పనియం దభిరుచిలేని ఉపాధ్యాయున కెట్టి మంచి పరిస్థితులు కల్పించినను తన విధిని సరిగా నెరవేర్పజాలడు. మంచి ఉపాధ్యాయుల నేర్పరచి, మంచి పాఠశాలల నెలకొల్పి విద్యాభివృద్ధి గావించుటకు ప్రభుత్వ మీ క్రింది అయిదు విధులను పాటింపవలసి యుండును,

వివిధ పాఠశాలలు అనగా ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత, వృత్తి పాఠశాలలను ఆయా ప్రదేశములం దుండెడి వారి కనుగుణముగ నెలకొల్పుట మొదటివిధి. పై విధముగ పాఠశాలల నేర్పాటుచేసిన తదుపరి విద్యావంతులు కాని తలిదండ్రులను తమ బాలురను పాఠశాలలకు పంపవలసినదిగా నిర్బంధించుట రెండవవిధి. లేకున్న వారు ఆ పాఠశాలల నుండి లాభమును పొందజాలరు. ఈ నిర్బంధము కనీసము ప్రాథమిక పాఠశాలల వరకైన నుండవలయును.

ఈ విధముగ పాఠశాలలను, నిర్బంధ విద్యా విధాన మేర్పాటుచేసిన పిమ్మట వాని కొరకెంత వ్యయమగునో విచా రించుటయును, ఎంతభాగము బాలుర తలిదండ్రులు భరింపవల యునో నిర్ణయించుటయు మూడవ విధి. ఈ వ్యయమును భరించు టకే ప్రభుత్వమునకు తన ప్రజలనుండి సుంకమును సేకరింప వలసియుండును. విద్యను చాల చౌకచేసిన యెడల తలిదండ్రులు

తమకు గల బాధ్యతను గుర్తెరింగి, నిర్వహింపక పోవచ్చును. కావుననే నాగరిక దేశములందు ప్రాథమికవిద్య నుచితముగ గ్రపబడుచు, ఉన్నతవిద్య యొక్క వ్యయము తలిదండ్రులే భరింపవలసి యుండును. ప్రభుత్వము మాత్రము విద్య కొనసాగింపలేని బీద విద్యార్థులకు వేతనము లిచ్చి తోడ్పడుట సమంజసము.

పాఠశాలానిర్వహణ విధానమును తన స్వాధీనమందుంచుకొని తగిన శాసనము లేర్పాటు చేయుట నాల్గవవిధి. కొంత మంది మేధావంతులను విద్యాప్రణాళిక నేర్పాటు చేయుటకై ప్రభుత్వము నియమించును. ప్రణాళిక నేర్పాటుచేసిన తరువాత బోధనాపద్ధతుల నిర్ణయించుట యందు ప్రభుత్వ ముపాధ్యాయులకు గల స్వేచ్ఛకు భంగము కలిగించరాదు. కాని కొంత మంది విద్యావేత్తలను సంప్రదించి యుపయోగింప నర్హమగు పద్ధతులను గురించి యుపాధ్యాయులకు తెలుపుటయే ప్రభుత్వ కర్తవ్యము. ఇంతకన్న ప్రభుత్వ మెక్కువ జోక్యము కలిగించుకొనుట ప్రమాదకరము.

సమర్థతగల ఉపాధ్యాయులు పాఠశాలలందు పనిచేయుటకు లభించునట్లుగా జేయుట ప్రభుత్వ పంచమవిధి. మంచి తెలివి, నేర్పు, సానుభూతిగల యుపాధ్యాయుల నేర్పాటుచేయకున్న ప్రభుత్వము విద్యకొరకు జేసిన యేర్పాట్లన్నియు వృథా శ్రమకు హేతువగును. ఏలయన పాఠశాలలు నిర్మించుట, వాని యందు బాలుర నింపుట వాని పర్యవేక్షణ(Supervision)వసతుల

గల్పించుట యినన్నియు విద్యాయంత్రి వివిధ భాగములను సమకూర్చుటయే యనవచ్చును. ఇట్లుచేయుట యుత్తమమే కాని యీ యంత్రమును నడుపు శక్తి యుపాధ్యాయుడే. ఇట్టి ఉపాధ్యాయులను సంసిద్ధ పరచుట ప్రభుత్వ ముఖ్య కర్తవ్యము. దీనికొరకై బోధనాభ్యసన పాఠశాలల నెలకొల్పి, వానినుండి సక్రమ శిక్షణమునొంది విద్యాబోధనమునం దారితేరిన యుపాధ్యాయులను వెలువడునట్లు చేయవలయును.

ఈ పై విధులను పాటించు ప్రతి ప్రభుత్వము తన రాష్ట్రమునందలి ప్రతివ్యక్తికి అతని జన్మహక్కగు విద్యాభ్యసనమున కవకాశము కల్పించుటయేగాక మంచి పౌరుడగుటకు కావలసిన రాజకీయ జ్ఞానమును సమకూర్చును. కనుకనే ప్రభుత్వముగూడ నొక విద్యాసంస్థగా భావింప బడుచున్నది.

4. వృత్తి ( Profession ):— ఇంతవఱకు చెప్పబడిన గృహ, పాఠశాల, ప్రభుత్వములే విద్యాసంస్థలుగాక వృత్తిని గూడ ఒక సంస్థగా పరిగణింపవచ్చును. ప్రాచీన కాలమందు వృత్తిశిక్షణము పాఠశాలలం దియ్యబడక పోవుటవలన బాలుడు తన తలిదండ్రులతో పాటు పనిచేసిగాని, లేక మంచి నేర్పరివద్ద కొంతకాలము పని నేర్చుకొనిగాని వృత్తిని అభ్యసించుచుండెడి వాడు. కాని ఆధునిక ప్రపంచమునందు వృత్తి నేర్పుటకై పాఠశాలలు స్థాపింపబడినవి.

పూర్వము పాఠశాలలందు వృత్తుల నేర్చుట కవకాశము లేకుండెను. ఆ కాలమందు ఇప్పుడున్నట్లుగా నే వృత్తినైన

నవలంబించుటకు వ్యక్తికి స్వాతంత్ర్య ముండెడిదిగాదు. ఇంతియే గాక ఆ కాలమందు రైతులనుండి ఎక్కువ పన్నులు సేకరింప బడనందున ప్రభుత్వమీ వృత్తివిద్యకు నలయు వ్యయభారమును భరింపలేకుండెను. వివిధ వృత్తులను నేర్పుటకుగాను వలయునన్ని యంత్రములు లేకుండుటచే ఒకే పర్యాయము పెక్కుమంది విద్యార్థులకు శిక్షణమొసంగుట కవకాశము లుండెడివి కావు. ముఖ్యముగ విద్యార్థియొక్క సహజాభిరుచులను గ్రహించి వాని కనుగుణ్యముగ వృత్తి నేర్పాటుజేయు శక్తి, పద్ధతులు లేకుండెను.

ప్రస్తుతకాలమందు వెనుకటివలె గాక వ్యక్తి తన ఇష్టాను సారముగ వృత్తి నవలంబించుటకై అవకాశమును పొంది యున్నాడు. నిరుద్యోగ సమస్య, ఆర్థికదుస్థితిని పోగొట్టుటకై ప్రభుత్వము, సంఘము, పాఠశాలలయందు వృత్తిని నేర్పుట తప్పనిసరి యని గ్రహించుచున్నవి. పాఠశాలలయందు వృత్తులను నేర్చుకొని విద్యను ముగించుసరికి బాలుడు యువకుడై తన కుటుంబపోషణమునకు సమర్థుడగును. ఇట్లే ప్రతివ్యక్తియు తాను సిద్ధపరచు వస్తువులవలన నితరులకు లాభములు గలుగజేయుటయే గాక తానుగూడ లాభములు పొందును. ఇట్లే ఇతరులచే జేయబడిన వస్తువులనుండి తానుగూడ లాభమును పొందగలడు. కనుక వివిధ వృత్తుల నవలంభించెడివారియందు దన్యోన్య సంబంధ ములు సంఘమునం దేర్పడుచుండును. కావున వృత్తిగూడ నొక విద్యాసంస్థయే.

5. మతము ( Religion ) :— ప్రపంచమందలి, సృష్టి వైచిత్ర్యములయందు గోచరమగు సృష్టికర్త ఘనతను తెల్పునది మతము. దీనివలననే మానవుడు సృష్టియందలి జీవరాసులతో సంబంధ మేర్పరచుకొని వానియెడల సానుభూతిని గలిగియుండును. నిజము పలుకుట, మంచి నడత నలవఱచుకొనుట మొదలగు నీతిమార్గములను నేర్చుకొనగలుగును. ఇట్టి జ్ఞానము వలననే ఆతడు తన జీవితమును జయప్రదముగ గడుపుకొనుచు తన సమాజాభివృద్ధికి సహకరించును. కావున మతము గూడ నొక విధమగు విద్యాసంస్థయని చెప్పవచ్చును.



# మూడవ అధ్యాయము

# బోధనా స్వభావము

## ( The Nature of Teaching )

ఒక పనిని మనము బాగుగ చేయదలచినయెడల ఆ పని వలన చిట్టచివరకు మనకు లభించు ఫలమును, ఆ ఫలమును బొందుటకు గావలసిన పరికరములును నెఱింగి యుండవలయును. నైపుణ్యముతో గూడినకార్యము సాధించుటకై జ్ఞాన మత్యావసరము. బోధన నైపుణ్యతతోగూడిన కార్యమని నొక్కిచెప్ప వచ్చును. సామాన్యముగ నిది ఎక్కువ జ్ఞానముతో ఆలోచనతో జేయబడక యాంత్రికముగ (Mechanically) జేయబడు చున్నది. ఇందువలన స్వల్పఫలితములు లభించును. యాంత్రికముగ జేయు పనియొక్క ముఖ్యలక్షణము లేమనగా : ఇందు సాధింపబోవు ఫలితమును దృష్టియం దుంచుకొనబడకపోవుటయేగాక ఆ ఫలితమును సాధించుటకై కొన్ని మార్గములు కూడ నుపయోగింపబడవు. ఇందు కేవలము పూర్వాచారమును దృష్టియం దుంచుకొని వాని ననుసరించియే కార్యము నిర్వహింప బడుచుండును. ఇట్టి యాంత్రికబోధన ఈ యాధునిక ప్రపంచమున కనువర్తింపదు. బోధనయం దిట్టి యాంత్రిక పద్ధతిని తప్పింపవలయుననిన బోధనాస్వభావమును గురించి బాగుగా నెఱింగి యుండవలయును. కావున బోధనాస్వభావమును గురించి విపులముగ తెలిసికొన యత్నించుదము.

బోధన విద్యయొక్క సాధనములలో నొకటి యని రూఢిగా జెప్పవచ్చును. దీని ముఖ్య కర్తవ్యము జ్ఞాన, నైపుణ్యముల నలవర చుటయే. ఈ బోధనావిధానమునందు ఉపాధ్యాయుడు, బాలుడు, విషయము (Subject) అను మూడు ముఖ్యాంగములు (Factors) గలవు. ఈ మూడింటియం దేర్పడు సంబంధమే బోధన యన బడును. ఉదా : ఒక ఉపాధ్యాయు డొక బాలునికి గణితమును బోధించు ననుకొనుడు. ఇందు బోధనసల్పు నుపాధ్యాయుడు, చదువుకొనువిద్యార్థి, బోధింపబడు విషయమే బోధనాంగములు. ఉపాధ్యాయు డే విధానముచే బాలునకు విషయమునకు సంబంధ మేర్పాటుచేయునో దానినే బోధనయందురు. కాన బోధన యొక్క ప్రధానకర్తవ్యము ఉపాధ్యాయుడు, బాలుడు, విష యము- ఈ మూడింటియందు సంబంధ మేర్పరచుటయే.

ఈ సంబంధ మేర్పడుటయం దీమూడు అంగములకు ప్రత్యేక స్థానముగలదు. ఈ మూడింటిలో నేదిలేకున్నను బోధన సమకూడదు. ఈ సంబంధ మేర్పాటుచేయుటయం దుపాధ్యా యుడే ప్రధానకర్త (Active agent). బోధనాస్వభావమును గురించి ఆలోచించునపుడు మనము ఉపాధ్యాయుని కర్తవ్యము గురించి గూడ ఆలోచింపవలసి యుండును.

ఉపాధ్యాయు డొక విద్యార్థికిని, విషయము (Subject) నకు సంబంధ మేర్పాటు చేయదలంచినపు డతనికి తన కార్యము కొనసాగ వలయుననిన నతడెన్నియో సంగతులు తెలిసికొనవలసి యుండును. వీనిలో ముఖ్యమైనది తాను బోధింపబోవు బాలుని స్వభావమెరుంగుటయే. అతనికి శిశుస్వభావము బాగుగ తెలిసి

యుండుటయేగాక తానుబోధించు బాలుర ప్రత్యేక లక్షణములు గూడ నెఱింగి యుండవలయును. బాలురయందు వ్యక్తిగత భేదములుండును. వారి పరిసరములు గూడ వేరువేరుగా నుండును. కాన వారియందు వివిధలక్షణము లేర్పడును. ఇంతియే గాక కొందరి యందు కొన్ని ప్రత్యేక శక్తులుండును. ఉపాధ్యాయుడు బాలురయందుండు వివిధ భేదములను గ్రహించి తగినట్లుగా మెలంగిననేగాని కృతకృత్యుడు కాజాలడు.

ఉపాధ్యాయుడు తన స్వభావమును, తన శక్తులను బాగుగా నెరింగినవాడై యుండవలయును. తన యలవాటులు, తన మూర్తిత్వము, తన చర్యల వలన బాలురపై ఎట్టి ప్రభావమును ప్రసరింప జేయుచున్నాడో దానిని గ్రహించి యుండవలయును. ఇట్టి జ్ఞానముచే నతడు సరియగు బోధనా పద్ధతుల నుపయోగించుటకు సమర్థుడై మంచి బోధన గరపగలుగును.

బోధనాసిద్ధాంతము మానసిక శాస్త్రము (Psychology) తర్కశాస్త్రము (Logic)లపై నాధార పడియుండును. ఎందువలన నన ఉపాధ్యాయుడు తానేబాలునికి విద్యగరపునో వాని స్వభావమును గుర్తెరుంగుటయే గాక తానే విషయములను బోధించునో దానికి సంబంధించిన సామాన్య జ్ఞానమును ముఖ్యముగా జెప్పబోవు భాగముయొక్క ప్రత్యేక జ్ఞానమును గలిగి యుండవలయును. బాలురమానసిక తత్వమును తెలిసికొనవలయునని మానసిక శాస్త్రము వలన కొంత సాహాయ్యము మాత్రమే లభించును. కాని పూర్తిజ్ఞానము బాలురతో స్వయముగ మెలగిననేగాని సమకూరదు. కేవలము మానసిక శాస్త్ర

జ్ఞాన ముండినంతమాత్రముననే బోధన ఫలవంతముగ నుండ జాలదు.

బోధన ఫలవంతముగనుండుటకై ప్రదర్శింపబోవువిషయ మందలి వివిధ భాగములకుగల అన్యోన్యసంబంధము బాలురకు విశదీకరింప బడుటయేగాక ఒక భాగము మరియొక భాగము నర్థము జేసికొనుటలో తోడ్పడునదిగా నేర్పాటు చేయబడి యుండవలయును. దీనినే బోధనయందు తార్కిక క్రమము నేర్పరచుటయందురు. కాన బోధన ఫలవంతముగా నుండ వలయుననిన నేదైన విషయమును బోధించునపు డుపాధ్యాయు డావిషయమును మానసిక, తార్కిక క్రమముల నమర్చి ప్రద ర్శింపవలయును.

బాలునికి తెలియని విశేషము లెన్నియో యుండును. బోధింపకున్నచో కొన్ని విషయములను బాలుడుగా తెలిసికొన జాలడు. కొన్ని విషయముల ప్రయోజనములను చెప్పకున్న వానిని గ్రహింపజాలడు. కాన ఇట్టి విషయములను చెప్పియే తీరవలయును. కాబట్టి బోధనయొక్క మరియొక ముఖ్య కర్త వ్యము జ్ఞానమును సమకూర్చుటయే.

బాలున కిదివరకున్న పూర్వజ్ఞానముతో క్రొత్తగా చెప్పబోవుచున్న విషయమును సంబంధపరచిననేగాని బోధన ఫలవంతముగ నుండదు. బాలుని పూర్వజ్ఞానమును గుర్తెరుంగక చేయు బోధన యంతయు వృథాశ్రమయగును. కాబట్టి బోధింప బోవు విషయము బాలుర పూర్వజ్ఞానముతో సంబంధ పరచుట గూడా ఉపాధ్యాయుడు బోధనయందు పాటింపవలసిన నియ మమై యున్నది.

కేవలము విషయజ్ఞానమును సమకూర్చుటయే బోధన కర్తవ్యముగాదు. ఇంతకన్న ముఖ్యమైన పని బాలుని తనంతటతానే నేర్చుకొనుటకు ప్రోత్సహింపచేయుటయే. ఇదియే బోధనకు బునాది. దీనిమీాదనే బోధనా పద్ధతులన్నియు నాధారపడియుండుట యుత్తమము.

బాలుని తన పరిసరములతో సరిపుచ్చుకొనునట్లు చేయుటయందు గూడ బోధన సాహాయపడును. అదెట్లన పుట్టినదాదినుండియు శిశువు ఏదోవిధముగ తన భౌతిక, సాంఘిక పరిసరములలో మెలగుచునే యుండును. కొన్ని చర్యలు శిశువు అభివృద్ధికి తోడ్పడును. మరికొన్ని తోడ్పడకుండును. ఉదా: ఒకబాలునికి ఇంటివద్దగాని లేక పాఠశాల యందుగాని ఏదైన కష్టముగలిగిన ధైర్యముతో దాని నెదిరించి జయించును. ఇది ఉత్తమమైన ప్రతిఫలచర్య. కొన్నివేళలందు చిక్కు కలిగిన దానిని తప్పించుకొని పారిపోవుటకు ప్రయత్నించును. ఇట్టిది ప్రమాదకరమైన ప్రతిఫలచర్య. జీవితమునం దంతయు నీ విధముగ సరిపుచ్చుకొనుటలు జరుగుచునే యుండును. కాబట్టి బోధన బాలుని తన పరిసరములతో సరిపుచ్చుకొనుటయందు తోడ్పడునని చెప్పవచ్చును.

బోధనయందే బాలురకు వారి సహజాతములను సక్రమమైన మార్గములం దుపయోగించుట కవకాశములు కల్పించి సరిపుచ్చుకొను విధానము ( Process of adjustment ) తేన చేయూత నొసంగవచ్చును. ఉదా: బాలునియందు పోరాడు సహజాతము గలదు. మన బోధన బాగుగ నున్నయెడల ఆత

డీశక్తిని తనకు పనియందు గలుగు కష్టములను జయించుట యందు వినియోగించును. కావున బాలుని తన పరిసరములతో సరిపుచ్చుకొనునట్లు చేయుటకూడ బోధనయొక్క యొకముఖ్య దృక్పథమని చెప్పవచ్చును.

ప్రేరేపించుట, (Stimulation) ఆవేశము కలిగించుట (Inspiration) గూడ బోధనయొక్క మరియొక దృక్పథమని చెప్పవచ్చును. ఉపాధ్యాయుడు బాలురయం దుత్సాహము కల్పించి వారిని కార్యాసక్తులనుగా చేయగలుగును. కనుక ప్రోత్సాహనే విద్యయని కొందరిచే నిర్వచింపబడుచున్నది. బాలురకు తగిన ప్రోత్సాహము కలిగించినచో వారు తమ సహజశక్తుల నుపయోగింప సమర్థులగుదురు. కేవలము బాలుర యం దుత్సాహము మాత్రము గల్పించుట చాలదు. బోధన వలన వారికి సరియైన మార్గమును చూపి, వారికాలము, శక్తి, నిపుణతలను వృధా గానియ్యక మంచి ఫలితములను పొందు నట్లుగా నుపాధ్యాయుడు చేయవలయును.

మంచి బోధన వలన నుపాధ్యాయుడు బాలుర ఉద్రేకము లకుగూడ సరియైన శిక్షణ మియ్యగలుగును. బాలుని మానసిక శారీరక శక్తులను వృద్ధిపరచుట, ప్రోత్సహించుట గూడ బోధ నోద్దేశమే యనవచ్చును. సామాన్యముగ నీదృక్పథము నంతగా గమనింపబడదు. బాలుర ఉద్రేకములందు స్థిరత్వ మేర్పరచుటయే ఉత్తమ బోధన లక్షణము.

పాఠశాలయందు సామాన్యముగా ఉద్రేకములు పురి గొల్పబడునుగాని వానిని అనుభవమునందు పెట్టుటకు అవకా

శములు గల్పింపబడవు. దీని వలన ఆ యుద్రేకముల బలము తగ్గిపోవును. కాబట్టి కేవలము చర్య జరుపుటకు పూనుకొన జేయుటయేగాక ఉత్తమ మార్గములందు చర్యను జరుపునట్లు గూడ చూడవలయును. వారి ఉద్రేకముల నుత్కృష్టపరచి వారియందు గణనీయమైన రసములను గల్పించుటయే బోధన సాధింపబోవు ఘనకార్యములలో నొకటి. దీనిపైననే శీల నిర్మాణ మాధారపడి యుండును.

బోధన ఎంతమంచి పద్ధతులపైన జరుపబడినను, బాలుడు ఉపాధ్యాయుడు తనస్నేహితు డనియు, తన కష్టసుఖములందు పాల్గొని మంచిమార్గములను చూపుననియు తలంపకున్న నట్టి బోధన నిరర్థకము. ఉపాధ్యాయునిమీద నమ్మక ముండిన బాలుడు తన భావములను, కష్టములను భయముపీడి వెలి బుచ్చును. దీనివలన బాలుడు నిష్కపటియగుట కవకాశము గలుగును. అతడు విషయములను తనలో దాచుకొను నలవాటు మాని, వానిని ధైర్యముతో బట్టబయలు చేయును. అతడు తన స్వానుభవములను గురించి చెప్పుట కుద్యుక్తుడగును గాన అత నికి తన మనోభావముల నణచుకొనవలసిన యగత్యముండదు.

పైన వివరింపబడిన రీతిగ బోధనాస్వభావము బాగుగా గుర్తెరింగిన యెడల నుపాధ్యాయుడు తనవిధిని అమోఘముగా నెరవేర్పగలడు.



# నాల్గవ అధ్యాయము



# బోధనాపద్ధతి సూత్రములు

# (Principles of Teaching Method)

బోధనాస్వభావమును గురించి తెలిసికొని యుంటిమి. మన ముపయోగించు బోధనాపద్ధతు లేసూత్రములపై ఆధార పడియుండునో విచారించుదము. దీనికొరకై బాలుడు, విష యము, ఉపాధ్యాయు డను బోధనాంగములనే ఎల్లప్పుడు దృష్టియం దుంచుకొన వలయును. అందులో ముఖ్యముగా బాలతత్వజ్ఞానమే మనకు బోధనా పద్ధతుల నియమించుటయందు చాల [illegible]డ్పడును. కాబట్టి ఈ దిగువ నుదాహరింపబడిన సూత్రములను బోధనాపద్ధతి నేర్పాటు చేసికొనునపుడు దృష్టి యం దుంచుకొను టుత్తమము.

1. కార్యాచరణసూత్రము(The Principle of Activity):-

బాలుర జీవితముయొక్క ముఖ్యలక్షణ మేమన వారియందు చురుకుదనము (Activity) కానుపించును. బాలురు సహజ ముగా చురుకుగా నుండి కార్యాచరణాసక్తి జూపుచుందురు. వారు శారీరక, మానసిక చర్యలను జరుపుచుందురు. బోధనా పద్ధతి నేర్పాటు చేయునపుడు ముఖ్యముగా బాలురయందుండు చురుకుదనమును మనము గమనింపవలసి యుండును. ఉపాధ్యా

యుడు బోధించునపుడు తానే వివిధక్రియలు సల్పుచు బాలురను స్తబ్ధులుగా నుండనియ్యక కొంతసేపు తాను చెప్పి, కొంతకాలము బాలురను స్వయముగాచేయుట కవకాశ మివ్వవలయును. ఉ:-ఉపాధ్యాయుడు గణితమును బోధించునపుడు తానే నల్లబల్లపై వ్రాసి, వస్తువులను తానే లెక్కపెట్టి, గుణకారము, భాగహారమును కూడ తానేచేసిన దానివలన బాలురకెట్టి లాభమును గలుగదు. అట్లుగాక బాలురకే ఆ పాఠమునం దెక్కువ జోక్యము కలిగింపవలయును. వస్తువులను వారిచేతనే లెక్కింపజేసి, కూడిక, గుణకారము మొదలగువానిని గూడ వారిచేతనే చేయింపవలయును. ఎందువలన నన తాను స్వయముగా జేయుటవలన బాలుడు బాగుగా నేర్చుకొనును.

బాలుడు తాను పొందిన జ్ఞానమును ఏదో విధముగ నుపయోగింప గలిగినపుడే అది యతనికి జీవితమునందు లాభకారి యగును. కాన బోధనయందు బాలురకిట్టి చర్యల కవకాశములు గల్పింప వలయును. బాలురు తాము సంపాదించిన జ్ఞానము నుపయోగించు నట్లుగా జేయవలయును. బాలురు గణితమునం దొక సూత్రమును నేర్చుకొనిన యెడల దాని నుపయోగించి కొన్ని అభ్యాసములను చేయునట్లుగా నియమింపవలయును. వారు మాతృభాషయందు కొన్ని పదములను నేర్చుకొనిన వానిని సొంతవాక్యములలో నుపయోగించునట్లుచేయవలయును. ప్రకృతిపఠనమం దొక పక్షి, ఉదా:-పావురమును గురించి చదివిన, ఆ పక్షిని స్వయముగా తాకి దాని శరీరభాగములను, లక్షణములను తెలుసుకొనుటయేగాక బాతు, కాకి, చిలుక మొదలగు

నితరపక్షులకు దానికి గల భేదములను గమనించు చర్యను వారిచే జరిపింపవలయును. ఈ విధముగ ఉపాధ్యాయుడు బాలుర మానసిక, శారీరక చర్యల కవకాశము కల్పింపవలసి యుండును. ఇట్టి అవకాశములు ప్రతి పాఠమునందు గల్పింప జాలకపోయినను చాల పాఠములందు గల్పించుటకు వీలగునని చెప్పవచ్చును. కొన్ని పాఠములం దిట్టి చర్యల కవకాశము లేకున్న కనీసము ఆ పాఠమువలన నింకొక విధమైన కార్యమును చేయుటకు సూచన కల్పింపవలయును. కాన బోధనాపద్ధతి నేర్పాటుచేయునపుడీ కార్యాచరణ సూత్రము (Principle of activity) నకే యగ్రస్థాన మియ్యవలసి యుండును.

2. జీవితానుసంధాన సూత్రము (ThePrinciple of linking wjth life):— మన మేదైన క్రొత్త విషయమును బాలురకు బోధింపవలయు ననిన ప్రారంభమునం దా బోధింప బోవు క్రొత్త విషయమును బాలుర పూర్వజ్ఞానముతో అనుసంధింపవలయును. ఎందువలన నన బాలుడు పాఠశాలకు వచ్చుటకు ముందే యింటియందు కొన్ని అనుభవములను సంపాదించును. పాఠశాలకు వచ్చిన తరువాత గూడ ప్రతిదిన మతనికి క్రొత్త అనుభవములు గలుగుచుండును. కాన క్రొత్తవిషయమును మనము బోధించుట ఖాళీగానున్న యొక సంచిని నింపునట్లుండదు. మనము బోధింపబోవు విషయమునకు సంబంధించిన యేదో యొక పూర్వానుభవము బాలున కుండితీరును. కాన బాలురకు క్రొత్తవిషయమును బోధింపవలయుననిన,

అక్రొత్త విషయమునకు, ఇంతకుముం దతనికి గల పూర్వాను
భవమునకు సంబంధము గల్పించియే తీరవలయును.

కాబట్టి మన బోధనాక్రియ అతని పూర్వానుభవము
నుండియే ప్రారంభము కావలయును. కాని యీ పూర్వాను
భవ మతని అభ్యాసకర్మమై యుండవలయును. ఉదా :- ఒక
బాలుడొక సినిమానుగురించి వినుటయేగాని చూచి ఎరుంగ
డనుకొనుడు. అతనికి సినిమాయందు చూపబడు దృశ్యములు,
వినుపించు గానములతో సంబంధపరచి నేదైన విషయమును
బోధించుట దుస్తరము. ఎందువలన నన అతనికి ఇంతకుముందు
వాస్తవమైన యనుభవము లేదు. గాన దాని సాహాయ్యముతో
నితరవిషయముల నర్థముచేసుకొన జాలడు. కాబట్టి బోధనాపద్ధతి
నేర్పాటు చేయునపుడు మన మేవిషయమును బాలురకు
బోధింప దలచుదుమో దానిని అతని వాస్తవజీవితముతో
సంబంధపరచవలసి యుండును. అనగా బోధనాపద్ధతి నేర్పాటు
చేయునపుడు జీవితానుసంధానసూత్రమును (The Principle of
linking with life) గమనింపవలసి యుండును. కాని మనపాఠ
శాలయందు బోధింపదలచిన ప్రతివిషయమున కిట్టి నిజమైన
పూర్వానుభవముతో సంబంధము గల్పింపజాలము. అయినను
నీయుద్దేశమును దృష్టియందుంచుకొని సాధ్యమైనంతవర కవ
కాశములను గల్పింపవలయును.

3. అభిరుచిసూత్రము (The Principle of Interest ):—

విద్య నేర్చుకొన వలయునన్న అభిరుచియే ముఖ్యసాధనము.
కాబట్టి బోధనాపద్ధతి అభిరుచి సూత్రముపై గూడ నాధారపడి

యుండవలయును. సహజాతములే అభిరుచి యంకురములుగాన నభిరుచిని గలిగించుటకై వీనినే పునాదిగా నుపయోగింప వలయును. బోధింపబోవు విషయమును బాలుర నిత్యజీవితకృషితో సంబంధపరచి కౌతుక సహజాతమును పురిగొల్పవలయును. ఈ కౌతుక సహజాత ప్రాబల్యముననే బాలుడు తనకు విచిత్రముగా దోచినవస్తువులను, విషయముల వివరములను దెలిసికొనగోరును.

మానవునియందుగల శాస్త్రాభిరుచి (Scientific interest)కి మూడవస్థలు గలవని చెప్పవచ్చును. క్రొత్తవస్తువును చూడగానే ఆశ్చర్యపడుట మొదటియవస్థ. దీనిని ఉద్రేకావస్థ యన వచ్చును. ఆ వస్తువుచూచినంతనే ఆశ్చర్యపడుటయే గాక దానిపై కొన్ని ప్రయోగములను సల్పి దానిని అనుభవము లోనికి తెచ్చుకొనుటకై ప్రయత్నించుట రెండవదశ. దీనినే అనుభవావస్థ యని చెప్పవచ్చును. అట్లనుభవము పొందిన తరువాత దానికారణ మూహించుట లేక తెలిసికొనగోరుట మూడవయవస్థ. దీనిని మానసికావస్థ యందురు. ఉదా :— ఒక పల్లెటూరిపిల్లవాడు క్రొత్తగా మొదటిసారి పట్టణమునకువచ్చినా డనుకొనుడు. అతడు నీటిగొట్టము ( Water tap ) నుండి నీరును తీసుకొనుటచూచి విభ్రమము జెందును. ఎందువలన ననిన అతనిగ్రామములో భావినుండి చేదితేనే గాని నీరు లభింపదు. అట్టి శ్రమ యేమాత్రము లేక నీరు సులభముగా లభించుట చూచి ఆశ్చర్య నిమగ్నుడగును. ఇది ప్రథమ ఉద్రేకావస్థ. అంతటితో నాగక, కౌతుక సహజాత ప్రోద్బలమున నతడు వెంటనే నీటిగొట్టము దగ్గరకు వెళ్ళి నీ రెట్లు వచ్చు చున్నదో తెలిసికొన యత్నించును. ఇంతియేగాక తాను

స్వయముగా నీటిగొట్టమును ముట్టుకొని ఎటుతిప్పిననీరుపడునో ఎటుత్రిప్పిన నీరుపడదో గ్రహించును. ఈ విధముగ నతడు క్రియాపూర్వకమైన అనుభవమును పొందును. ఇది రెండవదశ. దీని తరువాత నిట్లు నీరు శ్రమలేక వచ్చుటకు కారణము తెలిసికొన గోరుటకై అక్కడ నుండు పెద్దలను ప్రశ్నించును. ఇది మానసికావస్థ. మానవుని శాస్త్రాభిరుచియం దిట్టి మూడుదశలు గలవు. ఉపాధ్యాయుడు బోధనాపద్ధతి నేర్పాటు చేసికొను నపుడే శాస్త్రాభిరుచిని దృష్టియం దుంచుకొనవలయును.

చెప్పబోవు పాఠమునం దభిరుచి గలిగించిననే గాని బాలుడు నేర్చుకొనుటకై ప్రయత్నింపడు. ఒక బాలునకు చిక్కుడు మొక్కను చూపి నేడు దీనిని గురించి నేర్చుకొందమని చెప్పినంత మాత్రమున నతనికి నేర్చుకొనుటకు కుతూహల మేర్పడదు. కొన్ని ప్రశ్నలద్వారా అతనికి కౌతుక సహజాతమును పురిగొల్పవలయును. అతనికి చిక్కుడుగింజను, దాని నుండి వెడలిన మొలకను ఈ రెంటిని చూపి ఈ గింజనుండి ఈ మొల కెట్లుద్భవించిన దని ప్రశ్నించిన నతనికి కొంత చిక్కు గలిగి ఆలోచింప మొదలిడును. ఈ విధముగా మొదలు కొన్ని ప్రశ్నలను వేసి బాలురయం దభిరుచి పురిగొల్పవలయును. ఇంతియేగాక ఒకచిన్న ఉపన్యాసముచేతగాని, చిన్న ప్రయోగము వలననుగాని, ప్రకృతి దృశ్యములతో సంబంధపరచి గాని, బాలురకు చెప్పబోవు పాఠమునం దభిరుచి కలిగింప వచ్చును. కాబట్టి బోధనాపద్ధతి నిర్మాణమునం దీ యభిరుచిసూత్రమునకు గూడ తగిన ప్రాధాన్య మీయవలయును.

4. ముఖ్యోద్దేశ్య సూత్రము (The Principle of a definite aim):— ప్రతిఉపాధ్యాయుడు తానేపాఠమును బోధించునో దాని ముఖ్యోద్దేశము నేర్పరచు కొనవలయును. ఇట్లేర్పరచుకొనిన ముఖ్యోద్దేశముపైననే బోధనాపద్ధతి ఆధారపడియుండి యుండును. ఉదా:- ప్రకృతి పఠనమును బోధించునప్పుడుపాధ్యాయుడు తన ముఖ్యోద్దేశము, 'బాలురను ప్రకృతియందలి చిత్ర విచిత్రములను బాగుగ గమనింపజేసి ఆనందించుటకు సమర్థులనుగా జేయుటయే? నైన' యవలంభించు బోధనాపద్ధతి నొకవిధముగ నుండును. అట్లుగాక ప్రకృతి పఠనమునందు 'బాలుర స్వయంకృషికి, పరిశీలనకే ఎక్కువ అవకాశములు గల్పించి వారి పరిశీలనా శక్తికి తగిన శిక్షణము గరపవలయుననిన' నుపయోగించు బోధనాపద్ధతి మఱొకవిధముగ నుండును. కాన పాఠమును బోధించుటకు ముందు దాని ముఖ్యోద్దేశమును నిర్ణయించుకొనుట ఉపాధ్యాయునికి చాలముఖ్యము. ఇట్లు చేయుటకు కేవల ముపాధ్యాయునకేగాక బాలురకు గూడ లాభదాయకముగా నుండును. ఎందువలన నన వారు కూడ తాము నేర్చుకొనబోవున దేదియో స్పష్టముగా నెరింగి యుండుటచే పాఠమునం దెక్కువ అభిరుచిని చూపుచుందురు. కొందరుపాధ్యాయు లేయుద్దేశ్యము నేర్పరచుకొనక పాఠమును బోధించుచుందురు. అది చాలపొరబాటు. కాబట్టి బోధనా పద్ధతియొక్క నాల్గవ సూత్రము ఉద్దేశమును స్పష్టపరచు సూత్రమని చెప్పవచ్చును.

5. ఎన్నికోలు సూత్రము (The Principle of selection):-
పాఠముఖ్యోద్దేశ మేర్పరచుకొనిన తరువాత దాని కానుగుణ్యముగా విషయ మెన్నుకొనబడును. కాబట్టి బోధనాపద్ధతి నేర్పాటునం దీ ఎన్నికోలు సూత్రము(The Principle of Selection)ను గూడ గమనింపవలసి యుండును. హిందూ దేశమును గురించి ఒక భూగోళపాఠమును బోధింపదలచిన ఉపాధ్యాయుడు హిందూదేశమునకు సంబంధించిన ప్రతి విషయమును బోధింపజాలడు. అతని తరగతి యందుగల బాలుర పూర్వజ్ఞానము, వారి అవసరములను బట్టి వారికి తగిన భాగమును మాత్రమే బోధించును. ఇదేవిధముగా గణితమునందు భిన్నమును గురించి బోధింప వలయునని తలంచిన భిన్నములకు సంబంధించిన వివరము లన్నిటి నియ్యజాలడు. ఆ బాలురకు కావలసిన భాగమును మాత్రమే ఎన్నుకొని బోధింపవలసి యుండును. కాన నీ ఎన్నికోలుసూత్రము బోధనయందు చాల ముఖ్యమైనది. ఇది ముఖ్యముగా ఉపాధ్యాయుని సమర్థత, జ్ఞానముపై నాధారపడి యుండును. ఉపాధ్యాయుడీ సూత్రమును దృష్టియం దుంచుకొని విషయమును సరిగా నెన్నుకొనిన యెడల బోధనయందు జయము గాంచును. ఈ సూత్రముపైననే అతని జయాపజయము లాధారపడి యుండునని చెప్పవచ్చును.

6. విభజనసూత్రము ( The Principle of Division ):-
ఉపాధ్యాయుడు తాను చెప్పబోవు విషయముల నెన్నుకొనిన

తరువాత వానిని ప్రదర్శించుటకొరకై కొన్ని భాగములనుగా విభజింపవలసి యుండును. అట్లు విభజించిన భాగములలో వేనిని పాఠప్రథమసోపానమగు ప్రారంభము నందు బోధింప వలయునో వేనిని ప్రదర్శన, పునరావృత్తి సోపానములం దుప యోగింప వలయునో నిర్ణయించుకొనవలసియుండును. ఉపా ధ్యాయు డీ విధముగ ఏ సోపానమం దే భాగములను బోధింప బోవునది స్పష్టముగా నెరింగియుండవలయును. వానిని తన పాఠ క్రమ సూచికయందు వ్రాసికొని బోధించిన, బాలురకు గూడ చాల సులభముగ గ్రాహ్యమగును. ఒక భాగము మరియొక భాగమునకు తోడ్పడుటచే విషయము సులభముగ నర్థమగును.

ఉపాధ్యాయు డిట్లు తాను చెప్పబోవు బోధనాంశమును విభజించుకున్న చెప్పుపాఠము స్పష్టముగా నుండకపోవుటయేగాక అతడు తబ్బిబ్బు చెందుచుండును. బాలురు కూడ చికాకుజెంది కలవరపడుదురు. కాబట్టి ఉపాధ్యాయుడు ప్రదర్శనసోపానము నందు విషయముల తార్కికక్రమమును దృష్టియం దుంచుకొన వలయును. అంతియేగాక ఒక్కొక్క భాగము పూర్తికాగానే దాని సారాంశమునుగూడ వ్రాయింపవలయును.

7. <u>అభ్యాస పునరావృత్తిసూత్రము (The Principle of practice & revision)</u>:- ఒకపాఠమునం దేదైన నిపుణతగలిగించు టకై ప్రయత్నించునపుడు అంత్య సోపానమునందు బాలుర కభ్యాసమున కవకాశ మియ్యవలయును. కొంతమంది అనుభ వములేని ఉపాధ్యాయులు ఈ నియమమును పాటింపరు. అట్లు

పాటించకున్న వారి కృషి యంతయు నిరర్థక మగునని చెప్ప వచ్చును.

కేవలము బోధించుటయేగాక బోధింపబడిన విషయ మును బాలుడు బాగుగ గ్రహించినది లేనిది తెలిసికొని, లోప ములున్న సవరింపవలసియుండును. ఇదియుంగాక ఆ విషయ మును వారు బాగుగ జ్ఞాపకముంచుకొనునట్లుగా గూడా చేయ వలయును. దీనికొరకై పాఠాంతమునందు పునరావృత్తి జరుప వలసియుండును. పునరావృత్తి వలన బాలు రావిషయమును బాగుగ గ్రహింపగలుగుదురు. కాన బోధనాపద్ధతి నేర్పాటు చేయునపుడే అభ్యాస, పునరావృత్తి సూత్రమును గూడ దృష్టి యందుంచుకొన వలయును.



# అయిదవ అధ్యాయము

# పాఠముల విధములు

# (Kinds of Lessons)

సామాన్యముగా పాఠములు మూడువిధములు. జ్ఞాన సంపాదనకై యియ్యబడునవి మొదటివిధము. ఉదా:-గణితము నందొక క్రొత్త పద్ధతి బోధించుట, ప్రకృతిపఠమునం దొక పక్షినిగురించి తెలుపుట, భూగోళమునం దొక దేశమును గురించి వివరముల దెలుపుట మొదలగునవి. రెండవ విధము నిపుణత సంపాదించుటకై నియ్యబడునవి. ఉదా :- సంగీతము, చిత్రలేఖనము, చేతిపనులకు సంబంధించిన పాఠములు, పట ములను గీయుట (Map Drawing) పఠన, లేఖన పద్ధతులను వివరించు పాఠములు మొదలగునవి.

బాలుర గుణగ్రహణ (Appreciation) శక్తి నభివృద్ధి పరచుటకై బోధింపబడు పాఠములు మూడవ విధములో జేరినవి. ఉదా:- అర్థము, చందస్సులను బాటింపక కేవలము భావోద్రేక రసములను మెచ్చుకొనుటకే పద్యమును బాలురకు బోధించుట- ఇట్టిపాఠములు పద్యమునం దేగాక వచనము, సార స్వతము, చిత్రలేఖనము, గానము మొదలగువానియందుగూడ నియ్యబడుట కవకాశము గలదు. అనుదిన ముపాధ్యాయున కిట్టి పాఠముల నియ్యవలసియుండును. కనుక ఉపాధ్యాయున

కాపాఠముల యందలి సోపానములు, వాని నిర్మాణమును గురించి వివరములను తెలిసికొనుట ముఖ్యము. ఈ దిగువ నామూడు విధములను విపులముగ చర్చించుదము.

1. మొదటివిధము జ్ఞానసంపాదనము (Acquirement of knowledge) :– బాలుర కేదైన విషయము నందు జ్ఞానము సమకూర్చుటకై ఇయ్యబడు పాఠము (i) సిద్ధపరచుట లేక ప్రారంభము (Preparation or Introduction), (ii) ప్రదర్శనము (Presentation), (iii) పోల్చుట, సూత్రీకరణము (Comparision & Formulation) (iV) అభ్యాసము (Application) అను నాల్గు సోపానములు గలిగియుండును.

ప్రథమ సోపానముయొక్క ముఖ్యోద్దేశము బాలుర మనస్సు జ్ఞానమును గ్రహించుటకై సిద్ధపరచుటయే. కొందరు దీనినే ప్రారంభము లేక ప్రవేశమందురు. ఈ విధమైన పాఠములను బోధింపబోవునపుడు బాలుర పూర్వజ్ఞానము, వారి అనుభవములు తెలిసికొనుట మొదటికర్తవ్యము. కాబట్టి తా జెప్పబోవు పాఠమునకు బాలురను సిద్ధపరచుటకై ఉపాధ్యాయుడు మొదలు పూర్వజ్ఞానమును తెలిసికొనవలయును. బాలురకు తెలిసిన విషయములను స్వేచ్ఛగా చెప్పుట కవకాశ మిచ్చుచు వారి కేవిషయములందు జ్ఞానము కొరతగానున్నదో వారే గ్రహించునట్లు చేయవలయును. తదుపరి నాకొరతను పూర్తి చేసికొనుటకు అనగా జ్ఞానాభివృద్ధి కొరకు వారియందాసక్తి పుట్టింపవలయును.

ఈ సోపానమందు బాలురకు నూతనజ్ఞాన మంతగా కలిగింపబడదుగాన వారిచేతనే ఎక్కువగా పని చేయింపవలసి యుండును. ఇందుపాధ్యాయుఁడు సూచనా ప్రశ్నలద్వారా బాలుర అభిప్రాయములను దా జెప్పబోవు పాఠమువైపునకు మరలించును. ఇంతియేగాక అతడు ఒకమిక్కిలి చిన్నయుపన్యాసముచే వారికిగల పూర్వాభిప్రాయములను క్రమపద్ధతి నమర్చి తా జెప్పబోవు విషయమునం దభిరుచి గలిగించును. కాబట్టి యీ సోపానమందు చెప్పబోవు పాఠమున కుపకరించు బాలురందలి పూర్వాభిప్రాయములను పైకి తీసికొనిరాబడును. చిన్న ప్రయోగము వలనగాని లేక ప్రకృతి దృశ్యములకు సంబంధించిన సూచనలచేగాని చెప్పబోవు పాఠమునందు బాలుర కభిరుచి కలిగించి వారికౌతుక సహజాతమును రెచ్చగొట్టుచు, పాఠము నేర్చుకొనుటకై వారిని ఉద్యుక్తులనుగా నుపాధ్యాయుడు చేయును. కాని యీసోపాన మతిదీర్ఘముగా నుండకూడదు. దీనికొరకై ఎక్కువకాలమును గూడ వినియోగింపగూడదు.

సామాన్యముగా కొంతమంది ఉపాధ్యాయులు బోధనాంశమును త్వరగా ముగించుటకై యీ సోపానమును బొత్తిగా వదలివేయుటగాని లేక త్వరితముగ ముగించుటగాని జరుపుచుందురు. ఇట్లుచేయుట పొరపాటు. ఈ మెట్టున కెంతకాలము పట్టినది, ఎంతశ్రమ తీసుకొనవలసి వచ్చినది, వివిధ పరిస్థితులపై నాధారపడియుండును. ఉపాధ్యాయు డాతరతియందలి బాలుర నింతకుముందు బాగుగ నెరింగియుండి వారికిగల పూర్వజ్ఞానానుభవములను బాగుగ తెలిసినవాడగుటచే గతపాఠముల

త్వరగా సంబంధపరచి యీ మెట్టును సునాయాసముగా ముగించుకొనగలుగును. అట్లుగాక తరగతి బొత్తిగా క్రొత్తదైన యెడల వారి పూర్వజ్ఞానము నేమాత్రము నెరంగనివాడగుటచే సామాన్యముగ బాలుర సరాసరి వయస్సు, ఆ పాఠశాలయొక్క సమాన్యస్థితిని బట్టి జాగ్రత్తగా కొన్ని ప్రశ్నలనువేసి వారిని సిద్ధపరుపవలసి యుండును. ఇట్లుచేయుటకై అతడు చాల నిపుణుడుగను, యుక్తిపరుడుగను, చాకచక్యము గల వాడుగను నుండ వలయును.

పాఠోద్దేశప్రకటనము ( Statement of aim ):– ద్వితీయ సోపానమునకు పోవుటకు ముందు పాఠోద్దేశమును విధిగా ప్రకటింప వలయును. కండ్లకు గంతలుగట్టి తీసుకొనిపోబడు చున్నట్లుండక బాలుర కతడేమి తెలిసికొన బోవుచున్నాడో స్పష్టముగ తెలిసి యుండవలయును. బాలుడు, ఉపాధ్యాయుడు ఇద్దరుగలసి ఒకే సూత్రాన్వేషణకై బయలుదేరవలసియుండును. కొంతమంది పాఠోద్దేశమును మొదలే వెల్లడించిన బాలుర కౌతుకమునకు భంగము కలుగునని వాదింతురు. నిజముగా కొన్ని సమయములం దట్లు గావచ్చును. అయినను ఇట్లు అభిరుచినే పోషించుటవలన పాఠమునకే గొప్ప ఆటంకము గలుగ వచ్చును. ఒక ఉపాధ్యాయుడు తేనీరు ( Tea )మీద పాఠము నియ్యదలచుకొని దానిని రాబట్టుటకై నీవు ఉదయమున ఏమి త్రాగినావు ? అని వివిధప్రశ్నలు వేయుటవలన శ్రద్ధను కేంద్రీకరించుటకు నూరుగా చెదరగొట్టినవాడగును.

ప్రకటింపబడిన ఉద్దేశము కొన్ని సమయములందు ప్రశ్నరూపకముగనుండి దాని సమాధానము బాలురనుండి రాబాలని దైకూడ నుండవచ్చును. కాని క్రొత్తపాఠమునందు నేర్పుకొనబోవు నంశమును సూచించునదిగా నుండును. కావు ననే ఉద్దేశమును స్పష్టముగ వెలిబుచ్చవలయును. ఇట్లు వెలిబుచ్చుటలో బాలురకు తెలియని క్రొత్తమాటలుగాని, భావములుగాని యుండకూడదు.

రెండవ సోపానము, ప్రదర్శనము ( Presentaion ):— ప్రదర్శనమని చెప్పబడు రెండవ సోపానమం దుపాధ్యాయుడు క్రొత్త విషయాంశముల (Subject matter) ను ప్రవేశపెట్టును. ఇచ్చట తాను బోధింపబోవు నంశమును కొన్ని భాగములలో విభజించి ఒక్కొక్క భాగమునే ప్రదర్శించును. ఇట్లు ప్రదర్శించునపుడా భాగములను తార్కిక క్రమమున అమర్చును. ఇంతియేగాక ఒకభాగము మరియొకభాగము నర్థము చేసికొనుటకు తోడ్పడునట్లుగా చూడవలయును. స్పష్టతకై వేరుచేయబడిన భాగములను తిరిగి క్రమపద్ధతితో కలిపి, పూర్తివిషయములను సులభముగా నర్థము చేసికొనుటకు వీలు గలిగింపవలయును.

తృతీయసోపానము, పోల్చుట, సూత్రీకరణము (Comparison & Formulation);— బాలుడు తాను సంపాదించిన క్రొత్తజ్ఞానమును, తన పూర్వజ్ఞానముతో పోల్చివ్యత్యాసములను కనుగొన ప్రయత్నించును. ఈ విధముగ తన అనుభవములోనికి

వచ్చిన వివిధ వస్తువులను పోల్చి భావన (Concepts) లేర్పాటు చేసికొని సూత్రీకరణము చేయును. ఈసోపానమునందు స్వయముగా బాలురు పోల్చి, వ్యత్యాసములను తెలిసికొందురు. ఈ సందర్భమున నుపాధ్యాయుడు రెండువిషయములను ముఖ్యముగా గమనింపవలసి యుండును. పోల్చబడు వస్తువులను బాలుడు బాగుగ నెరింగి యుండుట మొదటి విషయము. ఎందువలన నన బాలుడు స్వయముగా నెరింగియుండని విషయముతో పోల్చుట వృథాయగును. పోల్చుటయందు గమనింపవలసిన రెండవ విషయ మేమన బాలుర ఆలోచనా శక్తికి ప్రోత్సాహము గలిగించి వారికి వాస్తవముగా లాభించువానినే పోల్చునట్లు చేయవలయును.

భౌతికశాస్త్ర (Physical Science), గణిత పాఠములందును, కొన్ని భాషా పాఠములందును పోల్చుట, సూత్రీకరించుట-యీరెండు క్రియ లొక దానిలో నొకటి లీనమైపోవును. అట్టిసమయములందు మిగుల నేర్పుతో ప్రశ్నలద్వారా సూత్రమును రాబట్టి, ఆసూత్రమును సొంతమాటలలో బాలురచే చెప్పింపవలయును.

<u>నాల్గవసోపానము అభ్యాసము (Application)</u> :—

బాలుడు తాను సంపాదించిన జ్ఞానమును ఉపయోగించుటకు గూడ సమర్థుడై యుండవలయును. అట్లు చేయగలిగినప్పుడే అతనికి ఆ జ్ఞానమువలన లాభము కలుగును. కాన బోధనా విధానమునం దీ తుదిమెట్టున కెక్కువ ప్రాముఖ్యము గలదు.

తానుసంపాదించిన జ్ఞానము నుపయోగించుటకు బాలుని సమ ర్థునిచేసి నిత్యజీవితావసరములతో దానిని సంధానపరచుటగానే యీ సోపానముయొక్క ముఖ్యోద్దేశము. సూత్రములను, నిర్వచనములను మాత్రమే నేర్చుకొనుటవలని కృత్రిమ జ్ఞానమే లభించునుగాని సరియైన మానసిక శిక్షణము ఈ అంత్య సోపానము వలననుగాని లభింపదు.

ఒక సూత్రమునేర్పాటుచేసిన తరువాత వాస్తవమైన పరిస్థితులందు దానిని ఉపయోగించునట్లు చేయవలయును. వివిధ మార్గములుపయోగించి అభ్యాస మియ్యవచ్చును. ఉదా:- బాలుడొక పటము (Map) లేక మాదిరి వస్తువును (Model) చేయును. అతడు భూగోళశాస్త్ర పాఠమునందు సంపాదించిన జ్ఞానము నుపయోగించి యొక మనఃకల్పిత ప్రయాణమును వర్ణింపవచ్చును. క్రొత్తపరిస్థితులలో కూడుకొనియున్న మరి యొక సమస్యను పరిష్కరింపవచ్చును. క్రొత్తప్రయోగమును చేయవచ్చును. లేక క్రొత్తచారిత్రిక పటమును సిద్ధపరుప వచ్చును. ఈ విధముగ బాలురు తాము సంపాదించిన జ్ఞానము నుపయోగించునట్లు చేయవలయును.

ఇంతవరకు జ్ఞానసంపాదనమునకు తోడ్పడు పాఠసోపాన ములను, వానిలక్షణములను తెల్పియుంటిమి. ఈ క్రింది ఉదా హరణములచే వానిని విశదీకరించుదము.

ప్రారంభ విజ్ఞానశాస్త్రము (Elementary Science) నందు 'ఉష్ణమునవలన ఘనపదార్థములు వ్యాకోచము నొందును' అని నిరూపింపవలసి యున్నదనుకొనుడు. బాలుర కంతకుముందు

పదార్థము, దానియొక్క మూడురూపములు అనగా ఘన, ద్రవ, వాయు పదార్థములను గురించి పూర్వజ్ఞానము గలదు. మొదటి సోపానమగు ప్రారంభమునందుపాధ్యాయుడు కొన్ని ప్రశ్నలను వైచి పదార్థము, దాని విధములను బాలురచే చెప్పించును. తరువాత బాలుర నీవిధముగ ప్రశ్నించును. చలికాలము నందు మనము ముడిచికొని ఎందుకు కూర్చుందుము? ఎండ కాలమునందు దేహమున ధరించినచొక్కాను తీసివైచి ఎందుకు విసరుకొందుము? కమ్మరివాడు బండిచక్రమునకు ఇనుపపట్టాను తొడుగుటకై దానిని పిడుకలయందుంచి కాల్చుటకు గారణ మేమి? ఒక సీసాయందు బిరడా గట్టిగ బిగిసిపోయిన యెడల దానినెట్లు తీయుటకు వీలగును? ఈ విధమగు ప్రశ్నలనువైచి బాలురకు చెప్పబోవు పాఠమునందభిరుచి కలిగించిన తరువాత నేడు మనము 'ఘనపదార్థములపై ఉష్ణమువలన గలుగుఫలితము లను కనుగొందమ' ని పాఠోద్దేశమును ప్రకటించును.

రెండవ సోపానము ప్రయోగములతో కూడినదై యుండును. ఇందు ఇనుము, రాగి, యిత్తడి మొదలగు కొన్ని లోహముల కడ్డీలను తీసికొని వానిని వేడిచేసిన నేమగునో బాలురకు చూపును. ఈ విధముగనీమెట్టునందు కొన్ని ప్రయో గములను చూపును.

మూడవ సోపానమునందు ప్రయోగమువలన లభించిన సారాంశముల నన్నిటిని పోల్చునట్లుజేసి వారిచే సూత్రీకరణము చేయించి'ఉష్ణమువలన ఘనపదార్థములు వ్యాకోచముజెందును' అను సూత్రమును రాబట్టును.

నాల్గవ సోపానమందు నిత్యజీవితమునకు సంబంధించిన కొన్ని ప్రశ్నలను వైచి ఆప్రశ్నలకు సమాధానము లిచ్చుట యందీసూత్రము నుపయోగించునట్లు చేయును. ఉదా:-ఈసోపానమునందు బాలుర నీవిధముగ ప్రశ్నించును. రైల్వేలైనుకు వేయబడిన యినుప కడ్డీలమధ్య కొద్దిస్థల మెందు కుంచబడును? ఒకదట్టమైన గాజుగ్లాసునందు మసలెడు నీరు పోసిన నది ఎందుకు పగిలిపోవును? వెలుగుచున్న లాంతరుగ్లాసుమీద వాననీరుపడిన నది ఎందుకు చిట్లిపోవును? ఇట్టిప్రశ్నలచే నభ్యాస మియ్యబడును.

మరియొక ఉదాహరణము భూగోళ శాస్త్రమునుండి తీసికొందము. ఒక ఉపాధ్యాయుడు ఏడవతరగతి చదువుచున్న బాలురకు హిందూదేశము గురించి భూగోళశాస్త్రము నందు పాఠములను చెప్పదలచినా డనుకొందుము. ఇంతకు ముందే బాలురు ఆసియా, ఐరోపా, అమెరికా ఖండములు, వానియందలి దేశముల నెరింగి యున్నారనుకొందము. మొదలు హిందూదేశముయొక్క భౌతికస్వరూపము(Physical configuration)ను గురించి బోధించుట ఉత్తమ మని తలంచును.

మొదటి సోపానమునందు పాలురకు యూరేషియా పటమును చూపి అందులో ఇండియాదేశ మెక్కడయున్నదో చూపుమనును. దీని భౌతికాకార మెట్లున్నదని ప్రశ్నించును. తరువాత హిందూదేశమునకు సంబంధించిన యేదైన విషయమును దెలిపికాని లేక కొన్నిప్రశ్నలను వేసికాని బాలురకు

హిందూదేశభూగోళజ్ఞానమును వివరముగ తెలిసికొనవలెననెడి యభిరుచి పుట్టించును. తరువాత హిందూదేశపు భౌతికవిషయములనుగురించి తెలిసికొందమని పాఠోద్దేశమును వెల్లడించును.

రెండవసోపానమునందుపాధ్యాయుడు పటమునందియ్యబడిన స్కేలు సాహాయ్యముతో హిందూదేశముయొక్క రమారమి పొడవు, వెడల్పు కనుగొనునట్లు చేయును. తరువాత నల్లబల్ల, భౌతికపటము ( Physical map ) మొదలగు పరికరముల సాహాయ్యమున హిందూదేశము, పర్వతములు, నదులు, మైదానములు, లోయలు మొదలగు వానిలో నెట్లు విభజింపబడి యున్నదో తెలుపును. ఇంతియేగాక సముద్రపు మట్టము నుండి వాని రమారమి ఎత్తెంత యుండునో తెలుపును.

మూడవ సోపానమునందు హిందూదేశమును, అదే మాదిరిగా నిర్మితమైన దేశములతో పోల్చునట్లు చేయును. ఉదా:—ఆశియాఖండము దక్షిణభాగమున హిందూ దేశమెట్లున్నదో, యూరప్‌ఖండ దక్షిణభాగమునందు ఇటలీదేశమట్లున్నదని బాలురచే పోల్చునట్లు చేయును. ఇదియునుగాక హిమాలయ పర్వతశ్రేణిని, ఆల్ప్సు పర్వతశ్రేణితో పోల్చునట్లు చేయును.

నాల్గవ సోపానము నందు వెంటనే అభ్యాసముకొరకై బాలురచేత భౌతిక స్వరూపములను తెలుపుటకై పటము ( map ) ను గీయించును. తరువాత బాలురచే మాదిరుల ( Models ) సిద్ధము చేయించును.

2. నిపుణత్వసంపాదనము ( Acquisition of Skill ) :—

జ్ఞానసంపాదన పాఠములకును, నిపుణత్వసంపాదన పాఠములకును భేదము గలదు. మొదటి విధమునందలి పాఠముల ముఖ్యోద్దేశము జ్ఞానసంపాదనమే కాని రెండవవిధములో చేరిన పాఠముల ముఖ్యోద్దేశము యేదో యొకవిధమగు హస్తకౌశల ( Manual skill )సంపాదనమై యున్నవి. పఠనము, లేఖనము, అన్యభాషయందు మాటలాడుట, అభ్యాసికగానము ( Practical music ) చిత్రలేఖనము, మాదిరులను చేయుట, శారీరక వ్యాయామము మొదలగు విషయములకు సంబంధించిన పాఠము లీ రెండవ విధమునందు జేరును.

ఈ విధమగు పాఠము లందుగూడ కొంత జ్ఞానము కలిగింపవలసి యుండును. పాఠముఖ్యోద్దేశము నిపుణత్వ సంపాదనమగుటచే నట్టిజ్ఞానము కేవలము కొంత సహాయకారిగానే యుండును. కాని యీ పాఠములందు బాలు డేదైన వస్తువును గురించి తెలిసికొనుటయేగాక కొంత ఆచరణ పూర్వకముగ దానిని చేయుటకూడ నేర్చుకొనును. ఈ పాఠములందు బోధనావిధానమును కొంతవరకు మార్చవలసి యుండును.

ప్రారంభము లేక ప్రవేశము ( Preparation ) :—

ఈ పాఠముల యందుగూడ ప్రారంభమే మొదటి సోపానము. వీనియందు గూడ సంపాదింపజేయు నిపుణత్వమందు బాలుర కభిరుచి కలిగించుచు, నిత్యజీవితముతో దానిని సంబంధపరచి నేర్చుకొనవలయునను కాంక్షను పెంపొందింప చేయవలయును.

రెండవసోపానము ప్రారంభించుటకుముందు పాఠోద్దేశమును ప్రకటింపవలయును. దీనివలన బాలురకు తామేమి చేయబోవు చున్నది స్పష్టమగును. కాబట్టి ఉపాధ్యాయు డీ సోపానమును చాకచక్యముతో ముగించినయెడల బాలురకు చేయబోవు పని యం దభిరుచి గలుగుటయేగాక యుపాధ్యాయునకు సహాకరించు టలో గూడ సంసిద్ధులగుదురు.

ప్రదర్శనము (Presentation) :— ఈ పాఠమునందు గూడ ప్రదర్శనమే రెండవ సోపానము. ప్రదర్శింపబోవు విష యము చిన్నచిన్న భాగములుగా విభజింపబడి ఒకదాని తరు వాత మరొకదానియందు నిపుణత్వము సంపాదింపబడుచుం డును. ఉదా:-ఒక మాటను వ్రాయుట, ఒక పద్యపాదమును చదువుట, ఒకగీతను గీయుట మొదలగు పాఠ్యవిషయమందలి చిన్నభాగములను నేర్చుకొనునపుడు రెండు పద్ధతులను దృష్టి యందుంచుకొనవలసియుండును. ఒకటి ఉపాధ్యాయునిచే ప్రదర్శింపబడిన మాదిరియొక్క పరిశీలనము. రెండవది దాని యనుకరణము (imitation). ఈ సందర్భమున మనము బాలు రను జాగ్రత్తగా పరిశీలించుటకును, సరిగా ననుకరించుటకును ప్రోత్సహింపవలయును. ఒక తరగతియందు బాలురకు 'వ్రాయుట'యందు నైపుణ్యతను బొందజేయుటకై ఉపాధ్యా యుడు ప్రప్రథమమున దానొకమాటను వ్రాయునపుడు జాగ్రత్తగా చూడమనును. తదుపరి వారికి 'వ్రాయుట' మాత్రమే చూపక కలమును పట్టుకొను విధానమును, గీతలుగీయు పద్ధతిని గూడ జూపును.

మూడవ సోపానమందు పాటింపవలసిన నియమములు పేర్కొనబడును. కాని యీ నియమముల యేర్పాటునందు కొంత జాగరూకత వహింపవలసియుండును. ఎందువలన నన నొక్కకళ నేర్చుకొను ప్రథమావస్థయందే ఈ నియమములకు కొంత స్థానము,విలువ యుండును గాని కొంత కాలము గడిచిన తరువాత నీ నియమముల నంతగా పాటింపవలసిన యవసర ముండదు. ఉదా:-ఒక వ్యక్తి యొక బొమ్మను గీయుటకై ప్రారంభమందు కొన్ని కొలతలను తీసికొని, చిత్తుగీతలసాహాయ్య ముతో దానిని శ్రమపడి పూర్తిచేయును. అనుభవము నైపు ణ్యాత హెచ్చినకొలది కొలతను తీసికొనుట, చిత్తుగీతలను గీయుట మొదలగు నియమములను తూచా తప్పకుండ పాటింప కయే యాబొమ్మను సునాయాసముగా గీచుటకు సమర్థుడగును.

నాల్గవ సోపానము, అభ్యాసము (Practice):-సామాన్య ముగా నిది చాలాదీర్ఘమైనదిగానుండును.ఎందువలన నన రెండవ సోపానమందు ప్రారంభింపబడిన చర్య లిందు పూర్తిగా పరిపక్వ దశకు జెందవలసి యుండును. అనగా ఉపాధ్యాయుడు చూపిం చిన విధానములను,చేసిన క్రియల నీసోపానమందు బాలు రనుక రింతురు. బాలు రిట్లనుకరించి సిద్ధముచేసిన దాని నుపాధ్యా యుడు సవరణజేయును. తప్పులను దిద్ది, సరియైన మార్గములను సూచించును. తప్పులు లేకుండ జేయుటకై చేయబడు వస్తువులు వికారముగ నుండకుండుటకై, అవసరమని తోచిన ఉపాధ్యా యుడు మరొకసారి పాటింపవలసిన నియమములను చెప్పును. తరువాత తిరిగి అభ్యాసము చేయించును. ఈ విధముగ అభ్యా

సము ( Practice ), సవరణ ( Correction ) యను నీ రెండు క్రియ లొకదాని తరువాత మరియొకటి నిపుణత్వము సాధించు వరకు జరుపబడుచుండును.

నిపుణత్వ సంపాదనకై యియ్యబడు పాఠములందు ఉపాధ్యాయుడు కొన్ని సంగతులను లక్ష్యమునం దుంచుకొన వలయును. మొదటివిషయము:- బాలురు తా మా నిపుణత్వ మెందుకు సంపాదింపవలయునో తెలిసికొని యుండవలయును. రెండవవిషయము :- సంపాదిత నిపుణత్వము బాలుర శక్తికి మించినదై యుండకూడదు. మూడవవిషయము :- చేయుపని యొక్క ప్రమాణము ( Standard ) బాలురకు కొంతకృషి జరపినమీాదటనే లభ్యమగునట్లుగా నుండవలయును. ఆపనియొక్క ప్రమాణము వారిశక్తికి మించియున్నయెడల బాలురు నిరుత్సాహముజెంది తమ ప్రయత్నమును విరమించు కొందురు. కాబట్టి వారు ప్రతిపర్యాయము చేయుబ్రయత్నమునకు కొంత ఫలితము చేకూరు చుండినయెడల తృప్తిజెంది, సంపూర్ణాభ్యసనమునకై పూనుకొందురు.

ఈ క్రింది యుదాహరణములచే నిపుణత్వ సంపాదన కొరకై యియ్యబడు పాఠములను విశదీకరించుదము.

'వ్రాయుటను' నేర్పుపాఠము :- మొదటి తరగతి బాలురొక వస్తువును పరిశీలించి, దాని పటమును గీచి, నోటిమాట లతో దానినిగురించి కొన్ని వాక్యములుగూడ చెప్పినా రనుకొందము. వారిచే నావస్తువునుగురించి కొన్ని వాక్యములను

క్లుప్తముగ వ్రాయించుటకై మొదటి సోపానమందు పై నుదహరించిన రీతిగ సిద్ధపరచిన తరువాత మన మిదివరకొక వస్తువు యొక్క పటమును గీచితిమి. తరువాత దానిని గురించి కొన్ని మాటలు నోటితోకూడ నుడివితిమి. ఇప్పుడు దానిని గురించి వ్రాయుదమని పాఠోద్దేశమును బాలురకు నుపాధ్యాయుడు తెలుపును. కేవలము దస్తూరి కుదుర్చుటకై వ్రాయుదమనిన బాలురకు నచ్చదు గాన నుపాధ్యాయు డీ పై విధముగ నుడివి యభిరుచి కల్పించును.

రెండవసోపానమగు ప్రదర్శనము నందు రెండు భాగము లుండును. మొదటి భాగము :- ఉపాధ్యాయుడు నల్లబల్లమీద నొక అక్షరముగాని, మాటనుగాని ఒక వాక్యమునుగాని వ్రాయును. వ్రాయుపద్ధతినిగూడ సూచించును. బాలుర పూర్వజ్ఞానము, వారి సమర్థతల కనుగుణముగా వ్రాయును. రెండవభాగము:— బాలురు ఆ వ్రాసినదాని ననుకరించుట, బాలురచే తప్పులు విశేషముగా చేయబడవచ్చును. అట్టి తప్పులు లేకుండుటకై వారు కొన్ని నియమముల నెరుంగవలసి యుండును.

మూడవసోపానమం దుపాధ్యాయుడు బాలురువ్రాసిన దానిలో తప్పులు లేకుండుటకుగాను వారు గమనింపవలసిన ముఖ్యనియమములను తెల్పును. ఇచ్చట బాలురకు రెండు గీతలమధ్య ఏయే యక్షరము లుండవలయునో, ఏయక్షరము యొక్క తలకట్టు గీత పైభాగమునం దుండవలయునో, ఏభాగము గీతక్రిందికి వ్రాయవలయునో సూచించును. అవసరమని

తోచిన బాలురు కూర్చుండు పద్ధతి ( Sitting Posture ). ని గూడ సవరించును. పిమ్మట వారిచే వ్రాయించును. ఈ నియమములను సరిగా పాటించుటకై బాలురను స్థిరచిత్తులను జేసిన తదుపరి నాల్గవ సోపానమగు నభ్యాసము ప్రారంభమగును.

నాల్గవ సోపానమందు ప్రదర్శింపబడినమాదిరిని బాగుగా ననుకరించుటకు బాలురందు నిపుణత్వ మేర్పడువరకు నభ్యాస, సవరణ క్రియ లొకదాని తరువాత మరొకటి జరుపబడును.

నిపుణత్వ సంపాదనకొరకై యియ్యబడు పాఠమునకు మరియొక యుదాహరణము 'గాత్రపుపాట' ( Vocal music ) నేర్పుటను తీసికొందము.

అయిదవ తరగతి చదువు బాలికలకు నొక త్యాగరాయ కీర్తన పాడుట నేర్పవలసి యున్నదనుకొనుడు. నేర్చుకొనబోవు కీర్తన మొదట వారికి కంఠస్థమై యుండవలయును. దానియందిమిడియున్న భావమునుగూడ నెరింగి యుండుటయేగాక దానిని అంతకుముందే మెచ్చుకొని యుండవలయును. అట్లు జరిగిన పిమ్మట గాత్రపుపాట నేర్పుటకై మొదటి సోపానమగు ప్రవేశమందు తరగతి యందలి బాలికలచే ఆ కీర్తనను పునస్స్మరణ చేయించును. తరువాత ఉపాధ్యాయుడాకీర్తన నొకసారి తాను పాడి యిది త్యాగరాజను నొక మహాభక్తునిచే పాడబడినది. దీనియందు భక్తిరస ముప్పొంగుచున్నది. దీనిని ఆత డే విధముగ పాడినాడో అట్లు పాడుటకై ప్రయత్నించుదమని

పాఠోద్దేశమును ప్రకటించి, ఆ బాలికల కా కీర్తన నేర్చుకొనుటకై ఆసక్తి కల్పించును.

రెండవ సోపానమగు <u>ప్రదర్శనమందు</u> పరిశీలనము ( observation ), అనుకరణము ( imitation ), ఒకదాని తరువాత నొకటి జరుపబడును. ఉపాధ్యాయు డాకీర్తన యందలి యొక్కొక్క చిన్న భాగమును తాను పాడును. తదుపరి బాలికల ననుకరింపు మనును. తాను రాగ మెక్కడ తీయునది స్థాయి నెచ్చట హెచ్చు చేయునది తగ్గించునది వివరించుచు పాడును. అవసరమని తోచిన రెండు, మూడు సార్లు చేయును. తరువాత కొన్ని పదములను కలిపి పాడును. ఆ తరువాత ఒక్కొక్క పంక్తిని పాడి తా నెట్లు పాడునో అట్లు పాడుటకై నియమించును. తదుపరి ఆ బాలికలను కీర్తనంతయు బాడుమని, అందులో కన పడిన తప్పులను సవరించి, తిరిగి యనుకరించి సరిగా పాడునట్లు చేయును.

మూడవ సోపానమందు లయ, తాళము, రాగాదులందు గమనింపవలసిన నియమములను బోధించును.

నాల్గవ సోపానమందు కీర్తనంతయు నభ్యసించుట కవకాశ మొసంగబడును. అభ్యాస, సవరణలవలన, కీర్తనయంతయు బాగుగపాడు నిపుణత్వము బాలికల యందు కలిగింపబడును.

<u>3. గుణగ్రహణ శక్తి సంపాదనము ( Acquirement of appreciation )</u>:—గుణగ్రహణశక్తి సంపాదనకొరకై యియ్యబడు

పాఠములు మూడవ విధములో జేరినవి. దీనియం దవలంబించు పద్ధతి వేరుగా నుండును. చిన్నబాలురకు బోధింపవలసియున్న, నిట్టి పాఠమునందు ప్రారంభము ( Preparation ), ప్రదర్శన ( Presentation) మిా రెండు సోపానములే చాలును. ఇందు సూచనల ద్వారా బాలురకు చెప్పబోవు పాఠమం దభిరుచి కలిగింప వచ్చును. ఇట్టిపాఠములందు సూచనలకే ఎక్కువ ప్రాముఖ్యము గలదు. కావున వీనినే ఎక్కువగా నుపయోగింతురు. సాధ్యమైనంతవరకు భౌతిక వాతావరణమును జేయూతగా గొని ఉపాధ్యాయుడు సూచన లిచ్చుటకు తగిన యవకాశములు కల్పించుకొనును. 'వాన'ను గురించి వ్రాయబడిన ఒక పద్యమును మంచి ప్రకాశవంతమైన దినమున బోధించు టంత భావ్యముగాదు. పద్యములందుగాని లేక వచనమందుగాని ప్రకృతిని గురించి వర్ణింపబడినపుడు, ఆ పద్యములనుగాని లేక వచనమునుగాని తరగతిగదిలో బోధించుటకన్న తరగతి గది వెలుపల బోధించుట యుచితము.

ఉపాధ్యాయుడు పఠించు పద్ధతివలనగూడ సూచనము కలుగును. అతడు తాను చదువునపుడే, గ్రంథకర్త భావములను బాలురకు సూచించునట్లు చేయును. వినుబాలురం దుద్రేకము పుట్టించును. అత డేవిషయమునకు ప్రాముఖ్యము నిచ్చునో తరగతి యందుగల బాలు రందరిదృష్టి దానివైపు మరల్చును. ఈ సూచనలే బాలురను బాగుగ ననుకరింప సమర్థులనుగా జేయును. ఇట్లుపాధ్యాయుడు బాలు రాపద్యమును బాగుగ మెచ్చుకొనునట్లు చేయును.

మెచ్చుకొనుశక్తి నెలకొల్పుటకై బోధింపబడు పాఠము ఒక విధమగు క్రీడ యనుపించును. కాబట్టి యితర పాఠములవలె దీనియందు ఖండితముగ సోపానము లేర్పరచుట కంతగా వీలుండదు. అయినను నిందు ప్రవేశము, ప్రదర్శనము, అభ్యాసము, అను మూడుసోపానము లుండును.

ప్రవేశము ( Preparation ):—బాలు రెక్కువగా మెచ్చుకొను సంగతులను, వారి యభిరుచులను ఉపాధ్యాయుడు తెలిసికొని, వారి నిట్టి పాఠమునకై సిద్ధపరుప వలయును. ఈ తీరున పాఠమందువచ్చు కఠినపదములను, అలంకారములను సామెతలను పాఠమును ప్రారంభించుటకు పూర్వమే బాలురకు విశదీకరింప వలయును. కాని ఒకే పీరియడునందు క్రొత్తపాఠమును బోధించుట, దానిని మెచ్చుకొనునట్లు చేయుట సమంజసము కాదు. బోధనాంశము నర్థము చేసికొను సమర్థత లేకున్న బాలుర కిట్టి పాఠమును బోధించుట వృధాయగును.

పై నుదహరింపబడిన జ్ఞాన, నిపుణత్వ సంపాదనములకు జెందిన రెండు విధములగు పాఠములందలి ప్రథమసోపానముల కన్న నీ పాఠమందలి ప్రథమ సోపానమున కెక్కువ కాలము పట్టును.

ప్రదర్శనము (Presentation ):— సాధ్యమైనంతవరకు ఉపాధ్యాయుడు తానే గ్రంథకర్తగా నెంచుకొనుచు పాఠ్యభాగమందలి గ్రంథకర్తయొక్క అభిప్రాయములను, భావములను సాధ్యమైనంతవరకు ప్రకటించుటకు ప్రయత్నింపవలయును.

ఉపాధ్యాయు డీవిధముగ బోధించిన పిమ్మట ప్రశ్నోత్తర ములద్వారా తాను బోధించిన అంశములలో వేనిని బాలురు తనవలె మెచ్చుకుందురో, వేనిని మెచ్చుకొనుటయందు తనతో నేకీభవింపరో తెలిసికొనవలయును. వారికి తమ యభిప్రాయ ములను, భావములను, స్వేచ్ఛగా వెలిబుచ్చుట కవకాశ మీయ వలయును. ఇట్టి బోధనవలన బాలురను విషయాంశములను బాగుగ మెచ్చుకొనుటకు సమర్థులనుగ చేయవచ్చును. ఉపా ధ్యాయు డిచ్చట గుర్తింపవలసిన విషయ మేమన బాలురను మెచ్చుకొనుటకై బలవంతపెట్టకూడదు. వారికి నచ్చకపోయిన స్పష్టముగా నచ్చలేదని చెప్పుటకు వారియందు ధైర్యము కల్పింపవలయును. బలవంతముగా మెప్పించుట ప్రమాదకరము.

<u>అభ్యాసము ( Practice )</u>:- బాలురు మంచి పద్యకావ్య మునుగాని లేక వచనమునుగాని లేక పటములనుగాని తమంతట తాము వ్రాసిగాని లేక చదివిగాని లేక రంగులువైచికాని మెచ్చుకొన గలుగుదురు. సాధ్యమైనంతవర కుపాధ్యాయుడు బాలురందుగల సృష్ట్యాత్మకశక్తుల ( Creative abilities ) ను ప్రోత్సహింపవలయును. బాలురను తమంతట తామే వ్రాయు టకుగాని లేక పాడుటకుగాని లేక ఆడుటకుగాని ప్రేరేపింప వలయును.

దీనికి ఉదాహరణముగా రెండవఫారము తెనుగు వాఠ్య వాచకము ( కవిరాజ వాచకము ) లోని 'క్యూరీదొరసాని' ( Madame Curie ) యను పాఠము దీసికొనుదము.

ఈపాఠము బాలుర యభినుతిశక్తిని పెంపొందించుటకై యియ్యబడుచున్నది. ఒకే పీరియడునందు ఈ పాఠమందలి కఠిన పదములు, అలంకారములు, సామెతలను బోధించుట- దానిని మెచ్చుకొనునట్లు చేయుట సమంజసము కాదు. కావున దీనిని బోధించుటకు పూర్వమే బాలురకు నీపాఠమందలి కఠినపదముల, సామెతల యర్థమును తెలుపవలసి యుండును.

ప్రథమ సోపానమగు ప్రారంభమునం దుపాధ్యాయుడు రేడియము ( Radium )అను ధాతువు ( Metal ) పరమ ప్రయోజనకారి యనియు, ఇది మహావ్రణ చికిత్సకు, పశురోగ నివారణకు, విషజ్వరనివృత్తికి, పరమౌషధమనియు, చెప్పి యిట్టిపదార్థమును కనిపెట్టినదెవరని ప్రశ్నించి బాలుర కౌతుక సహజాతమును రెచ్చగొట్టును. స్త్రీలకు 'భౌతిక' రసాయన శాస్త్రమెందులకు ? పాకశాస్త్రము చదువుము, అని ఒక విశ్వవిద్యాలయాధికారి మేలమాడినను 'క్యూరీసతి' శాస్త్రపరిశోధనలుచేసి, రేడియమును కనిపెట్టి జగత్ప్రఖ్యాతి గాంచెనని ఉపాధ్యాయుడు తెలుపును. ఈమె జీవితము జగన్నారీమణుల కెట్లు ఆదర్శమగుచున్నదో తెలిసికొందమని నుడివి బాలుర కాపాఠమునం దభిరుచి కల్గించును.

రెండవసోపానమగు ప్రదర్శనమందు ఈమె పోలెండు దేశమందలి 'వార్సా' నగరమున జన్మించుటయు, ఆమెతండ్రి ప్రొఫెసరు 'స్కోడా' యిచ్చిన శాస్త్రోపన్యాసములు ఆమెకింటి పెరటికల్పకములై ఎట్లు ఒంటబట్టెనో ఉపాధ్యాయుడు వివరించును. తదుపరి ఆమె విద్యనభ్యసించునపుడు శాస్త్రప్రయో

గములందు నామెకు గల ప్రయోగకౌశలమును గూర్చియామె యుపాధ్యాయుల పొగడ్త నెట్లు సంపాదించినది తెలుపును.

పిమ్మట ఆమె 'పియరీక్యూరీ' యను శాస్త్రజ్ఞుని బెండ్లాడి గృహ జీవనమునందును, శాస్త్ర పరిశోధనలందును భార్యా భర్తలు చేదోడు వాదోడై తమ కాపురమును స్వర్గ తుల్యముగ చేసికొనిరని సూచించును. వీ రుభయులును 'పిచ్ బ్లెండ్' ( Pitchblende ) అను మిశ్రద్రవ్యముతో ప్రయోగములు చేయ ప్రారంభించిరి. క్యూరీసతి కడుపు కట్టుకొని ప్రయోగములకు ధనము వెచ్చించి తుదకు బీదవడి నిలిచెను. భర్త నిరాశాహతుడయ్యెను. ఆమెమాత్రము పట్టువిడువలేదు. ఇంతలో ఆస్ట్రియా చక్రవర్తి ఒక టన్ను పిచ్ బ్లెండు క్యూరీసతి కంపెను. ప్రయోగములందు పిచ్ బ్లెండు చాలవరకు వ్యయమై పోయెను. ఫలము శూన్యము. యథాప్రకారము ఒకనాడు క్యూరీ మరల ప్రయోగము ప్రారంభించెను. ఆకస్మికముగ లేచి ఆమె చేతులుచఱచుకొనుచు నృత్యముసేయసాగెను. 'కృతార్థురాలను, కృతార్థురాలను' అని ఆమె యానందాశ్రువులతో భర్తృకరస్పాలనము చేసెను. ఆ ప్రయోగఫలమును భర్త పరీక్షించెను. మూడు వడ్లగింజల యెత్తు 'రేడియము' తయారయ్యెను.

ఈ విధముగా క్యూరీసతి గొప్ప కార్యదీక్ష వహించి, పెక్కు కష్టముల నెదుర్కొని, చిట్టచివరకు రేడియమును కని పెట్టుటయం దెట్లు కృతార్థురాలయ్యెనో విశదీకరించును.

కాని ఆమెభర్త 'పియరీక్యూరి' యనతి కాలములోనే 'పారిస్' నగరమున వీధిని బోవుచు మోటారుక్రింద బడి మరణించెను. ఆమె అటుపైగూడ బరిశోధనలు వదలిపెట్టలేదు. రసాయనశాస్త్ర పరిశోధనకు ఒక నోబిల్ బహుమానము సంపాదించెను.

1914 సంవత్సరపు ఐరోపా సంగ్రామమున నీమె రేడియమ్ చికిత్సచే సైనిక వైద్యాలయసేవ నెంతయో చేసెను. అమెరికా మున్నగు దేశములు ధనబహూకృతు లెన్నియో యామెకు కురిపించిరి. ఈ ధనములతోనే యామె తన మాతృభూమి 'వార్సా' లో రేడియమ్‌సంస్థ నిర్మించెను. ఎంత స్వార్థత్యాగము! ఎంత కర్తవ్యదీక్ష! 'పాకశాస్త్రపరిపాక మెఱుగదగ్గ' దని నిరసింపబడ్డ దొరసాని కీపదార్థ పుటపాకమున నెంతపరిపక్వత! 1934 వ సంవత్సరమున 'క్యూరీ' గతించినది. కాని 'రేడియమ్' జగత్తున నిలుచునంతవరకు క్యూరీ పేరు నిలువక తప్పదుగద! క్యూరీ ఆత్మజ్యోతి దేశదేశములకు వెలుగు కన్నొసంగినది.

ఈ విధముగ బాలురకు 'క్యూరీదొరసాని' భర్త గతించినను ధైర్యము వీడక శాస్త్రప్రయోగముల సమాప్తిచేయు కార్యదీక్ష, తనకు వచ్చిన ధనము నంతయు మాతృదేశమందు రేడియమ్‌సంస్థ నెలకొల్పుటయందు ఆమెకు గల మాతృదేశాభిమానము, స్వార్థత్యాగము, పరోపకారబుద్ధి మొదలగు విషయములను దెలుపుచు, ఆమె మానవజీవితమునకు చేసిన సేవను బాలురు మెచ్చుకొనున ట్లుపాధ్యాయుడు చేయును.

మూడవ సోపానమగు అభ్యాసమునం దుపాధ్యాయుడు కస్తూరిబాయి, సరోజినిదేవి మొదలగు ప్రసిద్ధి కెక్కిన మనదేశ నారీమణుల జీవితచరిత్రలను చదువుటకు బాలురను ప్రోత్సహించి వారికి ఆ యా నారీమణుల ప్రత్యేకఘనతను, దేశసేవను, స్వార్థత్యాగమును, మాతృదేశాభిమానమును మెచ్చుకొనుట యం దభ్యాసము నిచ్చును.



# ఆరవ అధ్యాయము

# కొన్ని బోధనా సూక్తులు

# ( Some Maxims of Teaching )

బోధనావిధానము క్రమముగా నుండుటకై అప్పుడప్పుడు గొప్ప విద్యావేత్తలు కొన్ని విద్యాసూక్తుల నుడివియున్నారు. ఇట్టిసూక్తులు పెక్కుగలవు. ఇందులో కొన్ని కేవలము యథార్థములుగా కానుపించును. అయినప్పటికి నివి పురాతనోపాధ్యాయత్వముయొక్క రసహీనమైన ఉపదేశములుగా భావింపబడును. ఇవన్నియు ఒకేసారి ఒకేపాఠమునం దుపయోగింపబడనేరవు. అందులో కొన్ని ఒకదానికి మరొకటి వ్యతిరేకముగ నుండును. విస్తరించిచెప్పిన ఇవి బోధనాపద్ధతియొక్క ముఖ్యలక్షణములను సూచించును. కావున మనము ఇచట కొన్ని ముఖ్యమగు సూక్తులనుగురించి తెలిసికొనుదము.

1. తెలిసినదానినుండి తెలియనిదానికి పోవుట (Proceed from the known to the unknown ):- అనునది ఒక ముఖ్య విద్యాసూక్తి ఒక పాఠముగాని లేక కొన్ని పాఠములవరుస( Series ) ను గాని ఎట్లు ప్రారంభింపవలయునో దీనివలన సూచన లభించును. ఇదియుంగాక సామాన్యముగ మనము ప్రతిపాఠమునం దేమిచేయ ప్రయత్నింతుమో దానినే యీ సూక్తి తెలుపు

చున్నది. అదియేదన క్రొత్తవిషయములకు ప్రాతవిషయము లతో సంబంధము నేర్పరచుట.

క్రొత్తపాఠమును బాలురకు పూర్తిగాగాని లేక అస్పష్ట ముగగాని తెలిసినవిషయముతో ప్రారంభించి క్రమేణ పాఠమును బోధించుచు వారిభావములను స్పష్టపరచుచు పోవలయును. ఇట్లొకొక్క భాగమును స్పష్టపరచుటయేగాక ఒక భాగము మరియొకభాగము నర్థము చేసికొనుటకు తోడ్పడునట్లుగా, తార్కిక క్రమమున ప్రవేశ పెట్టవలయును.

మనము బోధించువిషయము బాలురకు పూర్తిగా తెలిసినదైన వారికి దానియందు శ్రద్ధయుండదు. లేక ఆవిషయము వారిజ్ఞానమునకు మించినదై వారి కర్థముగాకున్నయెడల వారికా పాఠమునం దభిరుచియుండదు. కావునపాఠమునందు శ్రద్ధాభిరుచులను గలిగింపవలయుననిన వారికి కొంత తెలిసి, కొంత తెలియక చిక్కుగలిగిన విషయముతో ప్రారంభింపవలయును. తదుపరి ఆ చిక్కును క్రమేణ తొలగించిన వారికి పాఠమునం దభిరుచి కలుగును. ఇట్టియభిరుచి కలిగించుట కుపాధ్యాయుడు 'తెలిసినదాని నుండి తెలియని దానికిపోవుట' యను సూక్తిని తన దృష్టియందుంచుకొనవలయును. ఉదా:- (1) ప్రకృతిపఠన పాఠమందుపాధ్యాయుడు బాలురకు 'పండ్లు, వానివిధములు'ను గురించి బోధించుటకై వారికి బాగుగా తెలిసిన ఫలములతో ప్రారంభించును. (2) భూగోళశాస్త్ర పాఠమందు బాలురకు వారిరాష్ట్రమందలి రైలుమార్గములను దెలుపుటకై ప్రథమమున వారు

యున్న ప్రదేశమందలి రైలుమార్గముతో నుపాధ్యాయుడు మొదలుపెట్టును.

కొత్త జ్ఞానము కలిగించు నుద్దేశములేని పాఠమున కీసూత్రి తోడ్పడదు.

2. రూపాత్మక విషయమునుండి భావాత్మక విషయమునకు బోవుట. (Proceed from the Cancrete to the Abstract):- సామాన్యముగ చిన్నపిల్లలు తా మేవస్తువులను చూచి, తాకి, యిటునటు త్రిప్పకలుగుదురో వానినుండియే జ్ఞానము సంపాదించుచుందురు. అనగా ఇంద్రియానుభవములే వారి జ్ఞానమునకు మూలాధారము. ప్రథమమున నిరాకారములైన వానిని గ్రహింపక ఆకారము గలవానినే తెలిసికొన సమర్థులగుదురు. ఒక చిన్నపిల్లవానియందు ఆవుయొక్క భావన ( Concept ) మొదలు ఏర్పడక, క్రమేణ ఎన్నియో ఆవులను ప్రత్యక్షముగా చూచిన తరువాత యేర్పడును. కావున ఈ సూత్రివలన తేటపడునది యేమన, కొన్ని సామాన్యసూత్రముల నేర్పాటుచేయుటకు ముందు బాలురు కొన్ని ప్రత్యక్షవస్తువులను గాని, లేక ఉదాహరణములనుగాని చూడవలయును.

వివిధ విషయముల ( Subjects ) బోధించు పాఠములందు ఈసూత్రిని ఉపయోగింపవచ్చును. ఉదా :- (1) గణితమందు బాలురకు, ఒకటి, రెండు, మూడు. . . . మొదలగు అంకెలను నేర్పుటకై బాలురను చెవులతో మాత్రమే వినునట్లుచేయక, వారికి వస్తువులను లెక్కించుటయం దనుభవము కల్పింపవల

యును. వారు కొన్ని పుల్లలను, గవ్వలను, పూసలను లెక్కించిన తదుపరి వారి కాయంకెలను నేర్పవలయును. (2)భూగోళశాస్త్రమందు బాలురకు సూర్యగ్రహణమును గురించి బోధించుటకై ప్రథమమున మాదిరి (Model) ని ఉపయోగించి, ప్రయోగముద్వారా గ్రహణ మెట్లుకలుగునది, నిరూపించి తరువాత నిజమైన సూర్యగ్రహణమును గురించి యూహింపమనవచ్చును.

ఈ సూక్తివలన ఉపాధ్యాయుడు 'ప్రత్యక్షానుభవములు కలిగింపక సూత్రీకరణము చేయించుట' గొప్ప పొరబాటని గ్రహింపవలయును. ఇదియుంగాక బాలురకు తగిన ప్రత్యక్షానుభవములు కలిగిన తరువాత వారి నట్టివస్తువులను ఉపయోగించుటయందే నిలిపియుంచుటకూడ తప్పే. ఉదా:- గవ్వలు, పుల్లల నుపయోగించి బాలుడు సంకలనము నేర్చుకొనె నను కొనుడు. ఆవస్తువుల సాహాయ్యము లేకున్నను అతడు సంకలనము జేయు సమర్థత కలిగియున్నప్పు డతనిని, తప్పనిసరిగా గవ్వల నుపయోగింపమనుట యుక్తముకాదు. ఉపాధ్యాయుని దృక్పథము రూపాత్మకవిషయమునుండి భావాత్మకవిషయము వైపునకు పోవుటకై యుండవలయును. అట్లు చేయుటవలననే బాలురందు గూఢాభిప్రాయము (abstract ideas ) లేర్పడి హేతువాదనాలోచనములందు సమర్థు లగుదురు. కనుకనే హెర్బర్టు స్పెన్సరు అను విద్యావేత్త 'మనపాఠములను సాకారముగల వానితో ప్రారంభించి నిరాకారములగు వానితో సమాప్తి చేయవలసియుండును' అని నుడివెను.

3. 'ప్రత్యేకమునుండి సామాన్యమునకు బోవుట' (Proceed from the particular to the general ):—ఈ సూక్తికి దీనిపై నుడివిన 'రూపాత్మక విషయమునుండి భావాత్మక విషయమునకు బోవుట' యను సూక్తి రెండును ఒకే అర్థమును సూచించును.

4. 'సులభమునుండి కఠినమునకు పోవుట' (Proceed from the easy to the difficult ):— సులభమునుండి కఠినమునకు పోవుట సామాన్యముగ అందరికి తెలిసిన విషయమే. బాలురకు మనము బోధించు పాఠములు వారి పూర్వజ్ఞానానుభవమునుబట్టి సులభమునుండి క్రమముగా కఠినమునకు పోవునట్టివై యుండవలయును. కాని చాలకాలము క్రిందట బేకను (Bacon) సులభ విషయమునకు మారుగా కఠినవిషయమునే మొదట బోధించుట ఉత్తమమని తెలిపెను. ఈవిధముగ బోధించినయెడల సులభమగు పనులను చేయుట యొక క్రీడగా దోచును.

కొన్ని సమయములందు ఏది సులభమో, ఏదికఠినమో నిర్ణయించుట కూడ సులభసాధ్యము కాదు. అభ్యాసమువలన నిపుణత్వము లభించును. విషయము మొదట కఠినముగానున్నను, క్రమముగా అభ్యాసముచేత యది సులభమనిపించును. సామాన్యముగా తా[illegible]క దృష్టికి సులభ మనిపించునది వాస్తవముగ సులభముగ నుండక పోవచ్చును. ఉదా:- సులభమగు అక్షరములు లేక మాటలతో నారంభించి, చదువనేర్చుకొనుట,

తార్కికరీతిచే సరియైనది కావచ్చును. కాని బాలుర మానసిక శక్తుల ననుసరించి, వాక్యములతో నారంభించి చదువ నేర్చుకొనుటయే ఉత్తమ పద్ధతిగా పరిగణింపబడును. కాబట్టి సులభమేదియో నిర్ణయించుట యందు బాలుని మానసిక తత్వములను గూడ గమనింపవలసి యుండును.

మనకు తార్కికముగా సులభ మనుపించునది బాలురకు వాస్తవముగా సులభముగా నుండకపోవచ్చును. అందుచే 'ఏది సులభము? ఏది కష్టము?' అను దానిని నిర్ణయించుటలో తార్కిక క్రమముకన్న మానసిక క్రమమునకే ప్రాముఖ్యత నియ్యవలసి యుండును. ఇంతేగాక బాలుని అభిరుచిని గూడ దృష్టియం దుంచుకొన వలయును. సామాన్యముగ నిలువు, వంకర గీతలు గీయుట సులభమైనను, వానిని గీయుటయందు బాలుర కాసక్తి యుండదు. అట్లుగాక అతనికి నొక జంతుపటమును గీయుట వాస్తవముగ కాఠిన్య మనిపించినను దానిని గీయుటయందే యుత్సాహము చూపును. కాబట్టి యీసూక్తి వలన సరియైన లాభమును పొందవలయుననిన బోధింపబోవు విషయముల కఠినత్వక్రమము బాలుర మానసికతత్వముల ననుసరించి యేర్పాటు చేయవలసి యుండును.

5. **'సాధారణమునుండి సంక్లిష్టమునకు బోవుట' ( Proceed from the simple to the complex ) :-** అనునది మరి యొకసూక్తి. ఒక విషయమును దానికన్న సంక్లిష్టమైన దానితో పోల్చినయెడల సాధారణమైనది కావచ్చును. ఒక

మనుష్యునకు ఏవస్తువు సాధారణమనిపించునో అదే మరియొకనికి సంశ్లిష్టముగా నుండవచ్చును. బాలునకు ఒకవిషయము ఒక దశయందు సంశ్లిష్టముగా దోచినను, వయస్సు హెచ్చి, వికాసము జెందిన తదుపరి అదియే సాధారణముగా దోచవచ్చును. శిక్షణము గరుపబడుటకు ముందు చాల సంశ్లిష్టముగా దోచు విషయములు, శిక్షణమిచ్చిన తరువాత బహు సులభముగా దోచవచ్చును. మనము చిన్నవయస్సునం దేవిషయము లను చాల చిక్కైనవిగా దలంచుదుమో అవియే పెద్దవారమైన తదుపరి చాలా సాధారణమైనవిగా కానుపించును.

ఏదైన నొక ప్రత్యేక ( Particular ) పాఠమును ప్రారంభింప దలచినపుడు సాధారణమైన విషయమేది ? అని నిర్ణయించుటకు తోడ్పడునది బాలురపూర్వజ్ఞానమే. కాబట్టియే ఉపాధ్యాయునకు బాలుర పూర్వజ్ఞానమును గుర్తెరింగి యుండ వలసిన యావశ్యకత గలదు. ఒకవేళ ఉపాధ్యాయున కిట్టి జ్ఞానము లేకున్నయెడల, తగుప్రశ్నలద్వారా బాలుర పూర్వజ్ఞానమును తెలిసికొనవలసి యుండును. కాబట్టి బొత్తిగా సాధారణమైన దియు, లేక బొత్తిగా సంశ్లిష్టమైనదియు నేదియు లేదు. దానిని నిర్ణయించునది బాలుర విషయజ్ఞానము, మానసిక వికాసమే. ఉదా :- 'ఆహారము ( Food )' ను గురించి ఒకపాఠము నాల్గవతరగతి, ఏడవతరగతి, తొమ్మిదవతరగతి బాలుర కియ్య దలంచినచో ప్రతి తరగతి బాలురను నాపాఠమునకు సిద్ధపర చుటకై చేయవలసిన ప్రయత్నము వేరువేరుగా నుండును.

కావుననే ఈ సూక్తియందు 'సాధారణము' అనుదాని కర్థము (ఉపాధ్యాయునకు సాధారణముగా దోచునదిగాక) బాలురకు సాధారణముగా దోచునదియని తీసికొనిననే గాని యిది నిర్దుష్టమైన ( Correct ) విద్యాసూక్తి కాజాలదు. ఇందు వలననే ఉపాధ్యాయున కేది సాధారణముగ దోచునో దానితో పాఠమును ప్రారంభింపక, బాలుర కేది సాధారణముగ నుం డునో దానినుండి ప్రారంభింపవలయును. సంశ్లిష్టవిషయమే అయినను బాలుర కది సాధారణముగా దోచినయెడలదానితోనే పాఠమును ప్రారంభింపవచ్చును, కావుననే పాఠమును ప్రారం భించుటకు ముందు బాలురకు సాధారణ మనిపించున దేదియో బాగుగ ఉపాధ్యాయుడు తెలిసికొనవలయును. అనగా 'సాధా రణమునుండి సంశ్లిష్టమునకు' పోవలయును.



# ఏడవ అధ్యాయము



# బోధనోపకరణములు
# (The Devices of Teaching)

బోధనయందుపాధ్యాయునకు కేవలము బోధనాపద్ధతిని గురించి యాలోచించుటయేగాక సమయానుకూలముగ కొన్ని బోధనోపకరణములను (Devices of Teaching) గూడ ఉపయోగింపవలసిన యావశ్యకత యుండును. ఉదా:– బోధనయందుపాధ్యాయు డొకసమయమందు బాలురను ప్రశ్నించి, వారికి మాటలాడుట కెక్కువ యవకాశములు కల్పించును. మరొక సమయమందు తానే ఎక్కువగా మాటలాడుచు, విషయమును ప్రదర్శించును.

బోధనయందు పై నుదహరించిన రీతిగ ప్రశ్నలు, విషయ ప్రదర్శన ( Presentation ) మను బోధనోపకరణములనేగాక వివరణములు ( Illustrations ), నల్లబల్ల (The black-board), పరీక్షలు ( Examinations ), పాఠ్యగ్రంథములు (Text-Books), పాఠశాల గ్రంథాలయములు ( School Libraries ), వస్తుప్రదర్శనశాల ( Museum ) మొదలగు నితర బోధనోపకరణములను గూడ సందర్భానుసారముగ నుపాధ్యాయున కుపయోగింప వలసిన యవసరమేర్పడును. ఈ దిగువ నిట్టి బోధనోపకరణముల వివరములను తెలిసికొన ప్రయత్నించుదము.

## ప్రశ్నలు ( Questions )

బోధనోపకరణములందు ప్రశ్నలకే ఎక్కువ ప్రాముఖ్యత గలదని చెప్పవలసి యుండును. ఇచ్చట ప్రశ్నలనగా బోధనాసందర్భమున ఉపాధ్యాయుడు తరగతిలోని బాలుర నడుగు ప్రశ్నలని యర్థము. ఉపాధ్యాయుడు వేయు ప్రశ్నలు తలిదండ్రులు, తదితరులు వేయు ప్రశ్నలవలె సామాన్యమైనవిగా నుండక మంచి యాలోచనతో సిద్ధపరుపబడినవై యుండును. వీని సాహాయ్యముననే ఉపాధ్యాయుడు తాను బోధింపదలచిన విషయమును బాలురకు బోధించును. ఉపాధ్యాయునకు మంచి ప్రశ్నల నిర్మించుటయందు నేర్పు అత్యవసరము. అట్టి నేర్పు లేని ఉపాధ్యాయుడు తానిచ్చు పాఠమందు మంచి ఫలితములను పొందజాలడు.

ప్రశ్నలవిధములు:— ప్రశ్నలు ముఖ్యముగా మూడు విధములు.

(1) పరీక్షాప్రశ్నలు ( Testing Questions )
(2) బోధనాప్రశ్నలు ( Teaching Questions )
(3) అంత్యపరీక్ష లేక పునరావృత్తి ప్రశ్నలు ( Re-capitulatory Questions )

1. పరీక్షాప్రశ్నలు :— ఇవి బాలుర పూర్వజ్ఞానమును పరీక్షించుటకై పాఠమును మొదలిడునపుడు ఉపయోగింపబడును. ఈ ప్రశ్నల మూలమున నుపాధ్యాయుడు బాలుర

పూర్వజ్ఞానమును తెలిసికొనుటయే గాక పాఠ మధ్యభాగము నందు గూడ విద్యార్థి తాను బోధించు విషయములను గ్రహించుచున్నది, లేనిది తెలిసికొనుటకు ప్రయత్నించును. ఈప్రశ్నల ద్వారా క్రమశిక్షను గూడ చక్కబరచుకొనుటకు వీలుండును. బాలురకు ఉపాధ్యాయుడు పరీక్షించుటకుగాను తమ్ము ప్రశ్నించునని తెలిసియున్నచో వారు పాఠమునం దెక్కువ శ్రద్ధ వహింతురు.

2. బోధనాప్రశ్నలు :— క్రొత్త పాఠమును బోధించు సందర్భమున వేయబడు ప్రశ్నలు బోధనా ప్రశ్నలనబడును. వీని సాయమున బాలురు పాఠమును సులభముగా గ్రహింపగలుగుదురు. ఇవియే వారియందు జ్ఞానేచ్ఛను పుట్టించి క్రొత్త విషయములను నేర్చుకొనుటకై వారిని సంసిద్ధులను చేయును. వారి యోచనాశక్తిని గూడ నివి పెంపొందించును.

3. పునరావృత్తి ప్రశ్నలు :— ఇవి పాఠముయొక్క చివర భాగమునందు పునరావృత్తికొర కుపయోగింపబడును. వీనివలన బాలురకు తాము నేర్చుకొనిన విషయముల నొక క్రమములో నమర్చుకొని చెప్పుట కవకాశము లభించును.

ప్రశ్నల నుపయోగించు నుద్దేశములు :— సామాన్యముగా ఈ క్రింది యుద్దేశములను దృష్టియం దిడుకొని ప్రశ్నలుపయోగింపబడును.

(1) బాలుర పూర్వజ్ఞానమును పరీక్షించుటయే ప్రశ్నల నుపయోగించు మొదటి యుద్దేశము. బాలుర పూర్వజ్ఞానమును

పాఠమును మొదలిడుటకు ముందుపాధ్యాయుఁడు తెలిసికొనని చో నొకానొకప్పుడు వారికి బాగుగా తెలిసిన విషయములనే తిరిగి చెప్పును. లేక వారికి బొత్తిగా నర్థముగాని విషయములను గూడ చెప్పవొడంగును. కనుక పాఠమును ప్రారంభించుటకు ముందు బాలుర పూర్వజ్ఞానమును తెలిసికొనుట యత్యావశ్యకము.

(2) ప్రశ్నలద్వారా ఉపాధ్యాయుడు తాను బోధింపదలచిన విషయమువైపు బాలుర మనస్సును మరల్చును.

(3) ప్రశ్నల నుపయోగించుటయందు మూడవ యుద్దేశము బాలుకు బోధింపబడిన విషయము నెంతవరకు గ్రహించిరో తెలిసికొనవలయును.

(4) ఉపాధ్యాయుడు తానేదైన నొక విషయమునకు ప్రాముఖ్యత నిచ్చి, నొక్కి చెప్పదలచినచో అట్టి ప్రయత్నము ప్రశ్నలవలననే నెరవేరును. ప్రాముఖ్యత నియ్యదలచుకొనిన విషయమునకు జెందు ప్రశ్నలను వైచి ఉపాధ్యాయుడు బాలుర మనస్సులలో నావిషయము బాగుగా నాటుకొని పోవునట్లు చేయ సమర్థుడగును.

(5) బాలురు తాము పొందు జ్ఞానమును ఆచరణ పూర్వకముగా నుపయోగించుకొనుటకు ప్రోత్సహించుటయే ప్రశ్నల నుపయోగించు పంచమోద్దేశము. బాలురకు వడ్డీ కనుగొనుట కొక సూత్రమును నేర్పిన తదుపరి ప్రశ్నలద్వారా ఆసూత్రి

మును ఉపయోగించు కొనుటకై ఉపాధ్యాయుడు వారలను ప్రోత్సహింపవలయును.

మంచి ప్రశ్నల లక్షణములు:- మంచి ప్రశ్నలయం దీ క్రింది లక్షణము లుండవలయును.

(1) వేయు ప్రశ్నలు స్పష్టముగాను, స్ఫుటముగాను నుండవలయును. ఒకప్రశ్న కొకటియే యర్థ ముండవలయును. కాని నానార్థములు తీయుటకు తావిచ్చునదిగా నుండరాదు. ఒకప్రశ్నకు సమాధాన మొకటియే రావలయును గాని పెక్కు సమాధానములు వచ్చుట కవకాశ మిచ్చునదిగా నుండరాదు. అట్లు కానిచో నుపాధ్యాయు డొక సమాధానమును వచ్చునను కొనిన బాలు డింకొక సమాధానమును చెప్పి యతనికి నాశాభంగము కలిగించును.

(2) ప్రశ్నలు బాలుర శక్తి సామర్థ్యములకు మించి యుండరాదు.

(3) ప్రశ్నవాక్యములు సాధ్యమైనంత వరకు సులభశైలిలో చిన్నవిగా నుండవలయును.

(4) ప్రశ్న బాగుగా నాలోచించి సమాధానము చెప్పుటకు తగినదిగా నుండవలయును.

(5) సాధ్యమైనంతవరకు ప్రశ్న లుపాధ్యాయుని సొంత మాటలలోనే యుండవలయును.

(6) ప్రశ్నలరూప మెల్లప్పుడొకేతీరుగానుండి బాలురకు విసుగు పుట్టించునవిగా నుండకూడదు.

(7) రాబట్టదలచుకొనిన సమాధానమును సూచించు మాటలతో కూడుకొనిన ప్రశ్నలను వేయరాదు. ఉదా:-పులి గోళ్ళు వాడిగా నుండునా? యను ప్రశ్న వేయుట తగదు. ఏలనన నిందు 'అవును' 'కాదు' అను రెంటిలో నేదోయొక సమాధానము బాలు డాలోచింపకయే చెప్పుట కవకాశముండును.

(8) బోధనయందుపయోగింపబడు ప్రశ్నలలో పరస్పర సంబంధ ముండితీరవలయును. ఇంతియేగాక ఆప్రశ్నల సమాధానముల నొకచోట వరుసగా వ్రాసిన బోధించిన పాఠము యొక్క సారాంశము వచ్చునట్లుగా నుండవలయును.

<u>తరగతిలో ప్రశ్నల నెట్లుపయోగింపవలెను?</u> తరగతిలో నున్న బాలురందరిని చూచుచు ప్రశ్నింపవలయునే గానియొక్క పిల్లవానినే చూపుచు ప్రశ్నింపరాదు. అట్లు చేసినచో ప్రశ్నింపబడిన బాలుడుతప్ప తదితరబాలురు పాఠమునందు శ్రద్ధజూపరు.

ఉపాధ్యాయుడు చురుకుగాను,ఉల్లాసముతోను ప్రశ్నలను వేయవలయును. అట్లు వేసినచో పిల్లలత్యుత్సాహముతో పాఠమునందు పాల్గొందురు. ఇదియుంగాక ప్రశ్నలు మిగుల తొందరగా వేయబడినయెడల బాలురు వానిని సరిగా నర్థము చేసికొనలేక చికాకు జెందుదురు.

ఉపాధ్యాయుడు బాలుని ప్రశ్నించునపుడు, అతనినుండి సమాధానమును పొందునపుడు వారిద్ద రేదోరహస్యసంభాష

ణలో నున్నట్లుగా నితరబాలురకు దోచునట్లుండక వారలందరికి గూడ బాగుగ వినబడుచుండవలయును.

బాలుడు వేయబడిన ప్రశ్నకు సమాధానము చెప్పుచుండగా మధ్యలో నతనిని నాపివేసి మరియొకనిని ప్రశ్నింపక తాను వేసిన ప్రశ్నకు బాలుడు సమాధానమును పూర్తిగా చెప్పువరకు వేచియుండవలయును. ప్రశ్న వేసిబాలుడు సమాధానమిచ్చునపుడు మధ్యమధ్య విషయాంశముల ఉపాధ్యాయుడు అందింపకూడదు.

ప్రశ్నకు సమాధానము రాకున్న ఉపాధ్యాయుడు ప్రశ్నలోని మాటలను తరచుగా మార్చుచుండుట భావ్యముకాదు. ఇట్లు మార్చుటకుమారుగా బోధనకుపూర్వమే తానుబోధించు బాలుర మానసికశక్తుల ననుసరించి ప్రశ్నల సిద్ధము చేసికొనవలయును.

## ఉత్తరములు ( Answers )

ప్రశ్నలు వేయుట యెంతకష్టమో సరియగు యుత్తరములను రాబట్టుటగూడ యంతకన్న నెక్కువ కష్టమే యనవచ్చును. బోధనయందు నేర్పు, చాకచక్యము గల యుపాధ్యాయుడే తానడుగు ప్రశ్నలకు సదుత్తరములను రాబట్టగలడు. సామాన్యముగా బాలు రిచ్చు సమాధానములు కొన్ని సరియైనవిగాను, కొన్ని కొంతభాగమువరకే సరిగానుండి మిగతా భాగము తప్పై యుండును. మరికొన్ని పూర్తిగా తప్పులై యుండును. ఇట్టి సందర్భమున సరియగు ఉత్తరములను ఉపాధ్యాయు డంగీకరించును. పూర్తిగా తప్పులుగానున్న యుత్తర

ములను నిరసించును. కాని కొంతభాగమే సరిగానుండి మిగిలిన భాగము సరిగా లేనట్టి యుత్తరముల సవరించునపు డుపాధ్యాయుడు చాల నేర్పు, చాకచక్యముతో పని చేయవలసి యుండును.

ప్రశ్నమున నుపాధ్యాయుడు బాలురు తప్పు సమాధానము లిచ్చుటకు కారణములను గ్రహించుటకు యత్నింపవలయును. తరచుగా బాలు రిచ్చు ఉత్తరములు తప్పులై యుండుటకు మూడుముఖ్యకారణము లుండవచ్చును. బాలుని శ్రద్ధలేక జ్ఞాపకశక్తిలో నేదైనలోపముండుట మొదటికారణము. రెండవకారణము ఉపాధ్యాయుని బోధన సరిగానుండకపోవుట. చదువు పాఠమందలి కఠినపదముల యర్థమును గ్రహించుట యందు బాలుడు పొరపడుట మూడవకారణము. ఉపాధ్యాయుడు బాలురిచ్చు తప్పుసమాధానములకు కారణములను తెలిసికొని, ఉత్తరములోని తప్పుభాగమును మిగిలిన విద్యార్థుల సాయముతో సవరణ చేయవలయును.

## ఉపాధ్యాయుడు గమనింపవలసిన విషయములు.

అనుభవములేని ఉపాధ్యాయులు తాము వేయు ప్రశ్నలకు తామనుకున్న సమాధానములనే పొందగోరి, బాలు రింకొక మాదిరిగా సరియైన సమాధానము లిడినను వానిని నంగీకరింపరు. ఇట్లుచేయుట చాల ప్రమాదకరము. ఏలన తా నను కొనిన ప్రకారము బాలురు సమాధానములు చెప్పకపోయినంత మాత్రమున వారి సమాధానములను త్రోసిపుచ్చకూడదు.

ఉపాధ్యాయుడు బాలురిచ్చు సమాధానములను తిరిగి తా నుచ్ఛరింపరాదు. దీనివలన బాలుర శ్రద్ధాభిరుచులకు భంగము కలుగుటయే గాక కాలహరణము కూడ యగును.

నిర్లక్ష్యముతోనియ్యబడు సమాధానముల నుపాధ్యాయు డంగీకరింపరాదు.

బాలురు సమాధానము లిచ్చునపు డుపాధ్యాయుడు తాను వారికి మధ్యమధ్య నందించుట యుచితముకాదు. అట్లు చేయక బాలుడు చెప్పదలచుకొనిన సమాధానము పూర్తిగా చెప్పువరకు నుపాధ్యాయుడు ఓపికతో వినవలసియుండును. చెప్పు నట్టి సమాధానము తప్పుత్రోవకు జెందియున్న ఉపాధ్యా యుడు బాలుడుచెప్పు సమాధానమును నాపివేయవచ్చును.

ఒక బాలుడిచ్చుసమాధానము, తరగతిలోనున్న ఇతర బాలురందరకు వినబడునట్లుగా నుండవలయునని ఉపాధ్యాయుడు బాలురను హెచ్చరింపవలయును.

వ్రాత లేక నోటిపరీక్షలయం దియ్యబడు ప్రశ్నలకు దగిన సమాధానములిచ్చు పద్ధతులయందు బాలురకు శిక్షణమియ్య వలసిన బాధ్యత ఉపాధ్యాయునిపై నుండును. లేకున్న సరియగు సమాధానము లియ్యలేక పోవుటచే, కొందరు బాలురు తగినంత విషయజ్ఞానముకలవారైనప్పటికినిపరీక్షలందుఉత్తీర్ణులుకానేరరు.

## వివరణములు ( Illustrations )

బాలురకు బాగుగా తెలిసిన వస్తువులు లేక విషయముల సాయముచే వారి కింతకుముందు పరిచయము లేని విషయ ముల లేక క్లిష్టసమస్యల సులభముగా నర్థముచేసికొనుటకు

తోడ్పడు సాధనములనే వివరణము ( Illustrations ) లందురు.
ఉదా :- అతనిది ఱాతిగుండె అనువాక్యమును బోధించుటకై ఉపాధ్యాయుడు బాలురకు బాగుగా తెలిసిన వస్తువు అనగా రాతియొక్క సాయముచే ఆతని గుండెయందలి కాఠిన్యతను గురించి వివరింపగలడు. ఇచ్చట ఱాయియే వివరణము.

'గోపాలుడు సత్యహరిశ్చంద్రుడు' అను వాక్యమందలి భావమును బాలురచే గ్రహింపజేయుటకై వారికింతకుపూర్వమే తెలిసియున్న సత్యహరిశ్చంద్రుని కథావిషయ సాహాయ్యముచే గోపాలునియందు గల సత్యసంధత్వమును నుపాధ్యాయుడు తేట పరచును. ఇచ్చట సత్యహరిశ్చంద్ర కథావిషయమే వివరణము.

వివరణముల విధములు.




వివరణములు రెండువిధములు :- 1. పదవివరణములు 2. పదార్థ వివరణములు.

1. పదవివరణములు :— అపరిచిత విషయములను బోధించుటకై పరిచితపదములు లేక భావము లుపయోగింపబడును. వీనినే పదవివరణములందురు. వీనినికూడ రెండువిధములుగా విభజింపవచ్చును. (1) సామాన్యోదాహరణములు (2) రూపాలంకారములు లేక ఉపమానములు.

వ్యాకరణము, నీతిశాస్త్రము, విజ్ఞానశాస్త్రము మొదలగువానిని బోధించునపుడు విషయాంశములను వివరించుటకై సామాన్యోదాహరణము లియ్యబడును. ఉదాహరణముగా విశేష్యములనే బోధించు సందర్భమున వాని నిర్వచనములను బాలురకు తెలిపినపిమ్మట రాముడు, రాగి, బల్ల మొదలగు వివరణము లియ్యబడును.

విషయములను బాగుగా బోధించుటకై ఉపమానములు లేక రూపాలంకారములు తరచుగ నుపయోగింపబడును. ఉదా :— 'కోడి రామమూర్తి కలియుగ భీముడు.' ఇచ్చట కోడి రామమూర్తి బాహుబలమును విశదీకరించుటకై బాలురకదివరకే తెలిసియున్న భారతకథయందలి భీముని బాహుపరాక్రమమును ఉపమానముగా నియ్యబడును.

2. పదార్థ వివరణములు :— పై నుదహరింపబడిన పదవివరణములచే విషయములను బాగుగా విశదీకరించుటకు వీలులేనపుడు పదార్థములు లేక స్థూలవివరణము లుపయోగింపబడును. ఇవి ఐదు విధములు:— (1) యథార్థవస్తువులు (Actual objects); (2) మాదిరులు, ( Models ); (3) పటములు, ( Pictures );

చిత్తరువులు (Photos); (4) రేఖాకృతులు (outline drawings); (5) భూగోళ పటములు ( Maps ).

1. యథార్థ వస్తువులు:- యథార్థ వస్తువులను సమయానుకూలముగ బోధనయందు వివరణములుగా నుపయోగించుటవలన పాఠ్య విషయములయందు బాలురకు శ్రద్ధాభిరుచులు జనించును. అట్టి వస్తువులను బాలురకు దూరమునుండి చూపించుటకన్న వారికి వానిని చేతితో దాకి పరిశీలించుట కవకాశముల నుపాధ్యాయుడు గల్పింపవలెను. బాలుర శ్రద్ధకు భంగముకల్గించు యథార్థవస్తువులను తరగతిలోనికి తీసికొని వచ్చుట సమంజసముకాదు. ఉదా:- కోడిపెట్టను పిల్లలతోగూడ తీసికొనివచ్చుట; గుఱ్ఱము, బఱ్ఱె, గాడిద మొదలగు జంతువులను తీసికొని వచ్చుట.

2. మాదిరులు:— యథార్థవస్తువులను చూపుటకు అవకాశములేనపుడు మాదిరులవలన చాల సులభముగ బోధించుటకు వీలుండును. ఉదా:- గుండెకాయ, ఊపిరితిత్తులు మొదలగు వానిని గురించి బోధింపవలసి వచ్చినపుడు వాని మాదిరులను ప్రదర్శించుటవలన బోధన ఫలవంతమగును.

3. పటములు, ఫొటోలు:— బోధనయందు పటములు లేక ఫొటోలను ప్రదర్శించుటవలన బాలురకు పాఠము బాగుగా నర్థమగును. ప్రదర్శింపబడు పటములు పెద్దవిగానుండి, తరగతిలోని బాలురకందరకు నగుపడునట్లు వ్రేలాడగట్టబడి యుండవలెను. చిన్నపటములు లేక ఫొటోలను ఉపయోగింపవలసి వచ్చినయెడల నవి యెక్కువ సంఖ్యలో నుండితీరవలెను.

4. రేఖాకృతులు:—ఉపాధ్యాయుడు నల్లబల్లపై రేఖాకృతిని గీచి యందులో సందర్భానుసారముగ ముఖ్యవిషయాంశములను వ్రాయుచు బోధించినయెడల పాఠము బాగుగా బాలురకవగాహన మగును. కనుకనే ఉపాధ్యాయుడు నల్లబల్లపై రేఖాకృతులను బాగుగా గీయుటకు సమర్థుడై యుండవలెను.

5. భూగోళపటములు:— పాఠమునందు కొన్ని పట్టణములు, నదులు, పర్వతములు మొదలగు వానిని గురించి బోధింపవలసి వచ్చినపుడు నోటి మాటలలో చెప్పుటకన్న భూగోళ పటమునందు వానిని చూపుచు బోధించుటవలన బాలురకు పాఠము బాగుగా నర్థమగును. ఉపాధ్యాయునిచే సిద్ధము చేయబడి మంచిరంగులతో కూడియున్న భూగోళపటములు బాలుర నెక్కువగా నాకర్షించును. అందువలన నుపాధ్యాయుడు స్వయముగా వానిని సిద్ధము చేయుటకు వలసిన సమర్థతను పొందుటకు ప్రయత్నింప వలయును.

వివరణములవలన లాభములు:— (1) సంధానసూత్రి (Law of association) ప్రకారము విషయములు బాలురకు బాగుగా జ్ఞాపకముండును. (2) పరిశీలనాశక్తి వృద్ధియగును. (3) పాఠమునందలి కఠినాంశములు బాగుగ నర్థమగుటయేగాక పాఠము సజీవమై యెక్కువ శ్రద్ధను కలిగించును. (4) ఇంద్రియ శిక్షణ కవకాశము లభించును. (5) పరిచిత విషయములద్వారా అపరిచిత విషయముల బోధించుటకు వీలుండును.

వివరణముల నుపయోగించుటకై కొన్ని సూచనలు:—

(1) వివిధవిషయముల ( Subjects ) ననుసరించి వివిధ వివరణముల నుపయోగింపవలయును. ఇదియుంగాక ఉపయోగించు వివరణములు బాలుర మానసిక శక్తులకు తగినట్లుగా నుండవలయును. శిశుతరగతి బాలురకు స్థూలవస్తువులను ప్రదర్శింపవలసియుండును. క్రమేణ పెద్దతరగతులలో యోచనాశక్తిని నుపయోగించుటకు వీలొసంగు వివరణముల నుపయోగింపవలసియుండును.

(2) వివరణములు మనోరంజకముగా నుండవలెను.

(3) విశదీకరించి చెప్పదలచుకొనిన విషయాంశముల కన్న వివరణములు సులభముగా నర్థమగున ట్లుండవలయును. ఉదా:- నాల్గవ తరగతి బాలురకు ఒక దేశమందలి పంటలు, జనసంఖ్య మొదలగు విషయములను బోధించుటకై ఉపాధ్యాయుడు గ్రాఫ్‌ను (Graph) చూపుట సమంజసము కాదు. ఎందువలన నన ఆ గ్రాఫ్‌ను అర్థము చేసికొనుటే వారికి అసలు విషయమును తెలిసికొనుటకన్న కష్టతరము.

(4) వివరణములు బోధింపబడు విషయమునకు సంబంధించి యుండవలయును. ఉదా:-ఉపాధ్యాయుడు ఒక చిన్నతరగతిలోని బాలురకు 'భాగహారము' బోధించు సందర్భమున వివరించుటకై 'పిల్లులరొట్టె పంచుతగవు'ను కోతి ఎట్లు పరిష్కరించెనో తెలుపుచు, తత్సంబంధమగు పటములను చూపించుచు, నవ్వుమాటలతో కాలహరణము చేయుచు, తానిచ్చు పాఠ

ముఖ్యోద్దేశమును మరుగు పుచ్చుట అనుచితము. పాఠమునకు సంబంధించని వివరణములు అనగా కోతి, పిల్లులపటము, రొట్టె మొదలగు వానిని ప్రదర్శింపకూడదు.

నల్లబల్ల ( Black board ) :— మానసిక శాస్త్రవేత్తలు బోధనయందు నల్లబల్లకు చాల ప్రాముఖ్యత గలదని వక్కాణించియున్నారు. ప్రతిదినము పాఠముల బోధించు సందర్భమున నిది చాల యుపయోగకారిగా నుండును. బాలుర కిచ్చునట్టి యింటి పనిని నల్లబల్లపై వ్రాయుటచే దానియందు శుభ్రత, స్పష్టత యేర్పడును. పాఠముయొక్క సారాంశమును నల్లబల్లపై వ్రాయుటచే పాఠ్యభాగములకుగల పరస్పర సంబంధము చక్కగా బోధపడును.

పాఠమును బోధించునపుడు వచ్చునట్టి క్రొత్తపదములను నల్ల బల్లపై వ్రాసి వాని అర్థములను గూడ వ్రాసిన యెడల నా పదములు బాలురకు బహుత్వరగా జ్ఞప్తికి వచ్చును. నల్లబల్లపై ముఖ్యముగా అవసరమైన విషయములనే వ్రాయవలయును. నల్లబల్ల సారాంశము యుపాధ్యాయుని పాఠక్రమసూచికయందు ముఖ్యస్థానము వహించియుండును. ఉపాధ్యాయుడు నల్లబల్లపై అజాగ్రత్తగాను, వంకర టింకరగాను, నక్షరములను వ్రాయ గూడదు. ఇట్లు వ్రాయుటవలన బాలురయందు అజాగ్రత్త, అశ్రద్ధ, అశుభ్రత మొదలగు చెడ్డఅలవాటులు కలుగును. బాలురు సామాన్యముగా ఉపాధ్యాయునే అనుకరించుచుందురు. గాన ఉపాధ్యాయుడు వారియందు జాగరూకత, శుభ్రత మొద

లగు మంచి యలవాట్లను కలిగించుటకై నల్లబల్లపై స్ఫుటముగా మంచి దస్తూరితో వ్రాయవలసి యుండును.

పరీక్షలు ( Examinations ) :— తరగతియందుపాధ్యాయునిచే దీసికొనబడు పరీక్షలనుగూడ బోధనోపకరణములుగా బరిగణింపవచ్చును. బాలురకు ముందుగా దెలుపక తరగతియందిట్టి పరీక్షలను దీసికొనుట యుచితమని చెప్పవచ్చును. వీనివలన బాలురు బోధించిన విషయములనెంతవరకు గ్రహించియుండిరో తెలిసికొని, వారియందలి లోపములను సవరించుటకుపాధ్యాయునకు నవకాశము దొరకును. ఇట్టి పరీక్షలను తరచుగా తీసికొనుట బాలురకు చాల లాభదాయకము.

పాఠ్యగ్రంథములు ( Text-books ) :— పాఠ్యగ్రంథములను గూడ ముఖ్య బోధనోపకరణములనుగా నెంచవచ్చును. ఇది బొత్తిగా చిన్నతరగతులయందుగాక తదితర తరగతులందునుపయోగింపబడును. పాఠ్యగ్రంథములు స్పష్టముగా, మంచి కాగితములపై అచ్చువేయబడి యుండవలయును. వీనియందుపయోగింపబడు భాష బాలురకు సులభముగా నర్థమగు నట్లుండవలెను. ఈ గ్రంథములయందు వ్రాయబడు విషయములు దోషరహితములై యుండవలయును.

పాఠశాల గ్రంథాలయములు ( School Libraries ) :— గ్రంథాలయములను గూడ బోధనోపకరణములనుగా దీసికొనవచ్చును. కేవలము పాఠ్యగ్రంథములను పఠించినంతమాత్రమున నే బాలుర జ్ఞానాభివృద్ధి కాజాలదు. కావున పాఠశాలయందు గ్రంథాలయములనుగూడ నేర్పాటుచేయుట యత్యావసరము.

పాఠశాలయందు ప్రతితరగతికి నొక్కొక్క గ్రంథాలయ మేర్పాటుచేయవలయును. ఇట్టి తరగతిలోని గ్రంథాలయ ( Class library ) మందు ఆ తరగతి బాలురవయస్సు, మేధా శక్తికి తగిన గ్రంథములను సేకరింప వలయును. ఇందు గ్రంథ ములు బాలురు చదువు వివిధవిషయముల ( Subjects ) కు సంబంధించి యుండవలయును. ఈ విధముగా తరగతిలో నేర్ప రుపబడిన గ్రంథాలయమువలన బాలురకు చదువుటయందు కాంక్ష, యలవాటు లేర్పడును.

వస్తుప్రదర్శనశాల ( Musuem ) :— ప్రతి పాఠశాల యందు తప్పక వస్తుప్రదర్శన పాఠశాల నేర్పాటు చేయవలసి యుండును. దీనియం దుంచబడు వస్తువులు, చరిత్ర, భూగోళ శాస్త్రము, ప్రకృతిపఠనము, చిత్రలేఖనము మొదలగు విషయ ములకు సంబంధించి యుండును. ఇది పిల్లలయందుండు ప్రోగు చేయు సహజాత శిక్షణమునకు దోడ్పడును. బాలురకు వస్తు ప్రదర్శనశాలకై సేకరింపవలసిన వస్తువుల నుపాధ్యాయుడు తెలి పిన వారు వానిని సేకరించుటకై ప్రయత్నించుదురు.

వారు తెచ్చినవస్తువుల నన్నిటిని నొక కుప్పగానుంచక వానిని కొన్ని తెగలుగా విభజింపవలయును. ఆయా తెగల యందుండు వస్తువులను నమర్చి బాగుగా నగపడున ట్లుంచవల యును. ప్రతివస్తువుమీద ఒక చీటిని అంటించి దానిపేరు, తీసి కొని రాబడిన తేదీ, తీసికొనివచ్చిన బాలుని పేరు మొదలగునవి వ్రాయుటేగాక దానినిగురించి యొకటి రెండు వాక్యములను వ్రాయుట యుత్తమము.

## ఎనిమిదవ అధ్యాయము



# వ్యక్తికార్యము ( Individual work ).

# డాల్టన్ ప్లాన్ ( Dalton plan ).

<u>వ్యక్తికార్యము ( Individual work ) :—</u> బాలుర నందరి నొక తరగతియందు చేర్చి బోధించునపుడు వారియందున్న వ్యక్తిగత భేదములు, వారి శారీరక, మానసిక శక్తులందు గల వ్యత్యాసములు గమనింపబడవు. ఇంతియేగాక తరగతిగది యందు బాలుర నైసర్గిక చర్యల నణగద్రొక్కి, వారి నందరిచే నొకేమార్గము నవలంబింపజేయుటకై బలవంతము చేయబడును. ఒకే తరగతి యందు చదువు బాలుర వయస్సు రమారమి సమానముగా నున్నను వారిలో కొందరెక్కువ పొడుగుగాను, మరికొందరు మిగుల పొట్టిగాను నుందురు. వీరి నందరిని నొకేతీరుగా నున్న బల్లలపై కూర్చొనబెట్టి విద్యను గరుపుదురు. ఇంతియేగాక కొందరు వినుటవలనను, కొందరు చూచుటవలనను, మరికొందరు తాకుటవలనను విషయజ్ఞానము సులువుగా గ్రహింప గలుగుదురు. ఇట్టివారి నందరి నొకేపద్ధతి నవలంబింపజేయుట ప్రమాదకరమని తోచియే ఆధునిక బోధన ( New teaching ) యందు వ్యక్తి కార్యపద్ధతికి స్థానమియ్య బడుచున్నది.

వ్యక్తి కార్యప్రయోజనములు :— వ్యక్తికార్యమువలన పెక్కు ప్రయోజనములు గలవు. దీనివలన బాలురు స్వయముగ నాలోచించుటకు, తమకొరకై తామే పనిచేసికొనుటకు సమర్థులగుదురు.

సమిష్టిబోధనయందు బాలురకు తమయందుండు శక్తులను చూపుటకవకాశ మంతగా దొరకదు. కాని వ్యక్తి కార్యమువలన బాలుర సహజాభిరుచులకు, నైసర్గిక శక్తులకు తగిన ప్రోత్సాహము కలిగి వారి వ్యక్తిత్వమును వెలిబుచ్చుకొనుటకు వీలుగలుగును. ఇదియుగాక నీ కార్యమునందు బాలురు సమిష్టిబోధనయందువలె స్తబ్ధులై యుండక, చురుకుగా నుందురు. వారుపాధ్యాయునిచే నొసంగబడిన జ్ఞానముత్యములను కేవలము స్వీకరించువారుగా నుండక తమంతట తామే యీ ముత్యములకై యన్వేషణమును జేయుదురు. అవి లభించినమీదట వారికి వానివిలువ మరింత హెచ్చుగా నగపడును.

వ్యక్తి కార్యమునందు బాలు డొకపనిని తా నెంతవేగముతో ముగింప సమర్థుడో యంతవేగముతో దానిని ముగింపగలుగును. తరగతియం దట్లుగాక యితరు లెంత వేగముగ కార్యమును ముగించుదురో తానుగూడ నదేరీతిగా ముగించుకొనవలసివచ్చును. లేకున్న నిరుత్సాహుడై వెనుకపడియుండును. కాని వ్యక్తికార్యమునం దట్లుగాక బాలుడు తన సహజగతితో కార్యమును ముగించును. అట్లు ముగించుటవలన తృప్తి జెందుటయే గాక తానొక కార్యమును సాధింపగలిగితినని గూడ గర్వించును.

వ్యక్తి కార్యమువలన బాలురు తమ పనినిచేయు బాధ్యతను తాము వహించుటయేగాక నితరులపై నాధారపడక, తమపై తామే నాధారపడుటకు సమర్థులగుదురు.

వ్యక్తికార్యమునందుపాధ్యాయునికి ప్రతిబాలునిపై ప్రత్యేక శ్రద్ధజూపుట కవకాశము లభించును. దీనియందు వివిధవ్యక్తుల నవసరములనుబట్టి యుపాధ్యాయుడు తన బోధనా పద్ధతులనుగూడ మార్చుకొన సమర్థుడగును.

సమష్టిబోధనయందుపాధ్యాయునికి తనకృషి యెంత ఫలించినది యేర్పడదు. వ్యక్తికార్య పద్ధతియందు బాలురతో ప్రత్యేకముగ మాటలాడుట కవకాశములభించును గాన బాలురు తాను బోధించిన విషయము నెంతగ్రహించినది తెలిసికొన గలుగును. ఇట్లు తన కృషికిగలిగిన ఫలితము నెరింగి యుపాధ్యాయుడు తృప్తిని జెందును. వ్యక్తికార్యమువలన బాలుడు తన శక్త్యనుసారముగ నొక ప్రత్యేక ( Definite ) కార్యమును ముగింప గలుగుటవలన నతనియందు అభివృద్ధినిరోధకమగు అధైర్యము అశక్తిభావములు జనింపక వానికి మారుగా ధైర్య సాహసము లుద్భవించును. కాబట్టి వ్యక్తికార్యము క్రమపద్ధతులపై బాలురబుద్ధి, శీలము, భావన పెంపొందించుటకు దోడ్పడునని చెప్పవచ్చును. ఈకార్యమునందు సాధ్యమైనంతవరకు నేర్చుకొనుబాధ్యత విద్యార్థిపైననే వేయబడును. ఇందుపాధ్యాయుని కర్తవ్యము బాలురను ప్రోత్సహించుట, వారికి సూచనల నిచ్చుట, వారి తప్పులను దిద్దుటయే.

<u>వ్యక్తికార్యముపై ఆక్షేపణములు, వానికి సమాధానములు:</u>— వ్యక్తికార్యమునందు వ్యక్తికే యెక్కువ ప్రాముఖ్యతనిచ్చి, యతని జీవితమందలి సాంఘిక, సహకార, దృక్పథములు బొత్తిగా వదలివేయబడుచున్నవని కొందరు ఆక్షేపించుదురు. కాని ఈయాక్షేపణయందు పటుత్వముకానుపింపదు. ఎందువలన నన నిచ్చట కొంతమంది సవయస్కులైన వ్యక్తులొకచోట కలిసి తమతమ పనులను చేయుచుందురు. గానవారికి నొండొరులతో సంప్రదించుకొనుట కవకాశములు లభించుచుండును. ఇంతియేగాక అప్పుడప్పుడు వీరందరుకలిసి యేదైన నొక ప్రత్యేకసమస్యను చర్చించుటయు లేక అందరి సహకారము కావలసిన ఒక 'ప్రాజెక్టు'ను తీసికొనుటయు తటస్థించుచుండును. గనుక వారియందు వ్యక్తిత్వదోషము కలుగు నను భయ ముండుట కవకాశము లేదు.

వ్యక్తికార్యమువలన నుపాధ్యాయునకు తప్పులను సవరణజేయుపని ముఖ్యముగా జాల హెచ్చగుచున్నది. వ్యక్తిగతముగ బోధింపవలసియుండును గాన నిజముగా ఉపాధ్యాయునికి చాల శ్రమయే గలుగును. ఇదియుగాక ఉపాధ్యాయుడు తన పనినంతయు పాఠశాలయందే ముగించుకొనజాలక పోవుటవలన పాఠశాలయందేగాక యింటిలో తన విరామకాలమునందుగూడ ఈ పనిని ముగింపవలసివచ్చును. ఈ యాక్షేపణనుండి తప్పించుకొనుటకొకే మార్గమున్నదని చెప్పవచ్చును. అది యేదన స్వలాభము నపేక్షింపక, తన సర్వశక్తుల నుపయోగించి బాలురకు విద్య నొసంగుటయే ఉపాధ్యాయుని ముఖ్య ఆదర్శముగాన,

బాలుర లాభమును దృష్టియందుంచుకొని ఉపాధ్యాయు డీవిధముగ మరికొంతకృషి, తగిన ఫలము లభింపకున్నను, చేయుటయే యుచితమని చెప్పవచ్చును.

వ్యక్తికార్యపద్ధతి నవలంబించుటవలన ఒక సంవత్సరాంతమున బాలురు సంపాదించు జ్ఞానము వేరువేరుగానుండును. వీరి నందరినికలిపి సంవత్సరాంతమున ఒకే పరీక్ష తీసికొనుట కవకాశముండదని మరియొక యాక్షేపణ. దీని కిట్లు సమాధానము చెప్పవచ్చును. ఉపాధ్యాయుడెల్లప్పుడు తన బాలురతో దగ్గర సంబంధము గలిగినవాడై యుండుటేగాక ప్రతివారము వారు చేయుపనినికూడ పరీక్షించుచుండును. కాన సంవత్సరాంతమున ప్రత్యేకపరీక్ష తీసుకొను నావశ్యకత యుండదని చెప్పవచ్చును. ఒక వేళపరీక్షతీసికొనదలచినయెడల వారందరిచేత నభ్యసింపబడిన సామాన్య (Common) భాగమునందు మాత్రమే పరీక్ష తీసికొనవచ్చును.

వ్యక్తికార్య పద్ధతి నవలంబించిన యెడల పుస్తకములకు బోధనోపకరణముల కెక్కువ ధనము వ్యయము చేయవలసి వచ్చుననుట మరియొక యాక్షేపణము. ఇట్టి లోపములను తొలగించుటకై ప్రభుత్వముపై ఆధారపడుటకన్న భాగ్యవంతు లగు తలిదండ్రుల సాహాయ్యమును గోరుటయే యుత్తమము.

బాలురకు విద్యాగరపుటకు వ్యక్తికార్య పద్ధతియే చాల ఉత్తమమైనదని చెప్పవచ్చును. వ్యక్తికార్యమునకు జెందిన ఉత్తమోత్తమ పద్ధతి డాల్టన్‌ప్లాన్ (Dalton plan) అనియే నుడువవచ్చును. అట్టిడాల్టన్‌ప్లాన్ వివరములను తెలిసికొందము.

డాల్టన్‌ప్లాను (Dalton Plan) అమెరికా ఖండమునందలి డాల్టన్ (Dalton) అను పట్టణములో 1920 సంవత్సరములో మొట్టమొదట ఈవిద్యావిధానము మిస్ పార్క్‌హార్స్టు (Miss Parkhurst) చే ఒక హైస్కూలునందు ప్రవేశ పెట్టబడెను. అందుచే దీనికి డాల్టన్‌ప్లాను (Dalton Plan) అని పేరువచ్చినది.

ఈవిధానము మూడు ముఖ్యసూత్రములపై నాధార పడియున్నది. (1) స్వేచ్ఛ (Free-dom), (2) సాంఘికభావోత్పత్తి (Socialisation), (3)వ్యక్తికార్యము (Individual work)

1. స్వేచ్ఛ(Freedom):—డాల్టన్‌ప్లాను నందు బాలురకు తమ యిష్టమువచ్చిన పనిని చేయుటకై పూర్తి స్వేచ్ఛ నొసగబడును. కానియిది దుర్వినియోగము చేయుటకై యియ్యబడు స్వేచ్ఛగాదు. గంటధ్వని వినపడగానే ఒక విషయము (Subject)ను చాలించి మరొక విషయమును ప్రారంభింపవలెననెడి నిర్బంధ ముండదు. బాలున కభిరుచి కలిగి చదువ దలచుకొనిన విషయమును (Subject) అతని కిష్టమైనంత వరకు చదువుటకు స్వేచ్ఛ యొసంగ బడును. ఇట్లు పూర్తి స్వేచ్ఛ నియ్యబడుటచే బాలు డెక్కువ బాధ్యతతో విద్యను సాధించుటకై యత్నించును. బాలుర కియ్యబడు స్వేచ్ఛ వారి నైసర్గిక శక్తుల యభివృద్ధికి తోడ్పడును. ఈ విధానమందు విద్యనేర్చుకొను బాధ్యత బాలురందే ఎక్కువగా నుంచబడును. అట్టి బాధ్యత వహించుటవలన వారికి కలిగిన అనుభవముచే

నారు తమ భావిజీవితములందు సంఘములోగూడ గొప్ప భాధ్యతలను వహింప సమర్థులగుదురు.

2. సాంఘిక భావోత్పత్తి (Socialisation) :—డాల్టన్ పద్ధతి విద్యాపునర్నిర్మాణముయొక్క క్రొత్తవిధానమేగాని అది యొక క్రొత్తబోధనా పద్ధతికాదు. ఇది పాఠశాలను ఒకవిధమైన సంఘముగామార్చి యందు వివిధ బాలురందు పరస్పర సంబంధ మేర్పరచును. డాల్టన్‌ప్లాను ప్రకారము నడుపబడు ఒక పాఠ శాలయందు బాలుడు తానొక చిన్న ప్రజాప్రభుత్వమునకు జెందిన వ్యక్తినని భావించునట్లు చేయబడును. ఇంతియేగాక తానొక స్వపరిపాలనా వ్యవస్థకు సంబంధించిన వ్యక్తిననియు, పాఠశాలయందు మంచి ప్రభుత్వ మేర్పరచుట కితరుల కెంత బాధ్యతయున్నదో తనకుకూడ నంత భాధ్యత యున్నట్లుగా నతడు గ్రహించునట్లు చేయబడును. ఈ విధముగ డాల్టన్‌ప్లాను సాంఘిక బావోత్పత్తి (Socialisation) కి అవకాశములు కల్పించును.

3. వ్యక్తికార్యము (Individual work):— డాల్టన్ పాఠశాలయందు బోధన ప్రమాణము (Teaching unit) తర గతికాదు. దీనియందు వ్యక్తియే బోధనయొక్క ప్రమాణము (Unit). ప్రతివిద్యార్థి తనపనిని వ్యక్తిగతముగ నెరవేర్చును. ఉపాధ్యాయుడు ప్రతివిద్యార్థి విషయమై వ్యక్తిగత శ్రద్ధ జూపును. ఈ ప్లానునందు వ్యక్తికార్యసూత్రములను ఆచర ణలో పెట్టబడును.

డాల్టన్ప్లాను ప్రకారము ఒకపాఠశాల నడుపవలయు ననిన నాలుగువస్తువులు కావలసియుండును. (1) ప్రయోగ శాలలు లేక లేబరేటరీలు ( Laboratories ); (2) ప్రత్యేకోపాధ్యాయులు ( Specialists ).

(3) నియమిత కార్యములు లేక అసైనుమెంట్సు ( Assignments ).

(4) సైచూపులు ( Checks ).

1. లేబరేటరీలు ( Laboratories ):— డాల్టనుప్లాను ప్రకారము ఒక్కొక్క తరగతికి ఒక్కొక్కగది యుండక ఒక్కొక్క విషయము ( Subject ) నకు ఒక్కొక్కగది నియమింపబడి యుండును. ఉదా:-గణితపు లేబరేటరీ, చరిత్ర లేబరేటరీ, తెలుగు లేబరేటరీ,ఏ విషయము ( Subject ) నకు సంబంధించిన లేబరేటరీయందు ఆ విషయము ( Subject ) నకు సంబంధించిన పుస్తకములు, బొమ్మలు, పటములు మొదలగునవి అందులో నుంచబడి, ఆ విషయము ( Subject ) నకుతగిన వాతావరణమేర్పాటు చేయబడును. చరిత్రగదియందు చారిత్రిక పటములు ( Historical maps ), ఫుటోలు, మాదిరులు, చారిత్రికాభిరుచిని పురిగొల్పు చిత్రములును, చిత్రలేఖనపు గదియందు చిత్రలేఖనమునకు సంబంధించిన పరికరములు ( materials ) మంచిమాదిరి చిత్తరువులు ఉంచబడును.

ప్రతివిద్యార్థికి ఒక గదినుండి మరొకగదికి పోవుటకు స్వేచ్ఛయుండును. అతని కిష్టమైనయెడల గంటలకొలది ఒకే

విషయము ( Subject ) ను చదువవచ్చును. లేక అతనికిష్ట మున్నయెడల కొన్ని నిమిషములవరకొకవిషయము (Subject) మరికొన్ని నిమిషముల వరకు మరియొక విషయము (Subject)ను చదువవచ్చును. ఒకవిషయము ( Subject ) చదువునప్పు డతనికి విసుగు కలిగినయెడల, ఆతనిని ఆ సబ్జక్టే చదువుమని బలవంత పెట్టువా రుండరు. అత డేదైన నొకవిషయము ( Subject ) చదువుచున్నప్పు డతని కేదైన చిక్కు కలిగిన యెడల, అతనికి సాయపడుటక్కై ఉపాధ్యాయుడు ఆగదిలోనే యుండును. ఈ విధానము నందు ప్రతివిషయము బాలుని అభి రుచి, యిష్టముమీంద వదలివేయబడును. కావుననే పూర్వ విధానమునం దుపాధ్యాయుని భయముతో పాఠశాలలో జేయ బడు పనికంటె డాల్టన్ ప్లానునందు బాలురచే చేయబడు పని చాల లాభదాయకమై యుండును.

2. ప్రత్యేకోపాధ్యాయులు (Specialists):— ఆధునిక విద్యావిధానమునం దొకే ఉపాధ్యాయుడు అన్ని విషయములు ( Subjects ) ఒకే తరగతికి బోధింపక, ఒకేవిషయము ( Subject ) ఒక తరగతికి తరువాత మరియొక తరగతికి బోధిం చుట ఆచారమై యున్నది. డాల్టన్ స్కూలునందు గూడ నిట్టి ప్రత్యేకోపాధ్యాయుల ( Specialists ) ఆవశ్యకత యెక్కువగా గలదు. ప్రతి విషయమున ( Subject ) కొక గది యుండును గాన ఆగది యావిషయము ( Subject ) నందు ప్రత్యేక జ్ఞానము గలిగిన యొక ఉపాధ్యాయుని స్వాధీనములోనుండును. ఒక గదియందుం డుపాధ్యాయుడు ఆగదిలో పనిచేయు బాలు

రకు గలుగు వివిధసమస్యలను పరిష్కరించుటకు సమర్థుడై యుండవలయును. అనగా ఆ సబ్జక్టునందు 'స్పెషలిస్టు' ( Specialists ) అయి యుండవలయును.

3. అస్సైనుమెంట్సు ( Assignments ):— డాల్టన్ ప్లాను అంతయు నీ 'అస్సైనుమెంట్సు' మీాదనే ముఖ్యముగా నాధారపడి యుండును. ప్రతిబాలునకు ఒక నియమిత కాలము నందు పూర్తి చేయుటకై యియ్యబడు పనిని 'అస్సైనుమెంటు' అందురు. 'అస్సైనుమెంటు' వలన చేయవలసిన పని స్పష్టముగా తెలియును. అవి కొన్ని పెద్దభాగములు, తరువాత చిన్నభాగములు, తరువాత అంతకన్న చిన్నభాగములుగా క్రమపద్ధతి ప్రకారము విభజింపబడును.

సామాన్యముగ నేదైన విషయము ( Subject ) నందొక సంవత్సరములో బాలునిచే పూర్తిచేయబడవలసిన పనిని 'కాంట్రాక్టు' ( Contract ) అందురు. ఒకనెలలో ఒకవిషయము ( Subject ) నందు పూర్తి చేయవలసిన పనిని 'అస్సైనుమెంటు' అనియు, ఒకవారములో ఒక సబ్జక్టునందు పూర్తి చేయవలసిన పనిని 'పీరియడు' ( Period ) అనియు, ఒకరోజు పనిని ఒక 'యూనిట్' ( Unit ) అనియు చెప్పబడును.

ఈ విధముగ ఒకబాలుని వ్యక్తికార్యమత డెన్నిసంవత్సరము లాపాఠశాలయందు గడుపదలచు కొనునో అన్ని 'కాంట్రాక్ట్సు' (Contracts) గలదై యుండును. ప్రతి 'కాంట్రాక్టు' పది సమభాగములుగా విభజింపబడును. ఇట్లువిభజింపబడిన ప్రతిచిన్న భాగమును 'అస్సైన్‌మెంటు' అందురు. దీనిని ఒక నెలలో

బాలునకు ముగింపవలసి యుండును. ప్రతి 'అస్సైన్‌మెంటు' నాలుగుపీరియడ్లు గా విభజింపబడును. ప్రతి 'పీరియడు' అయిదు 'యూనిట్లు' గా భాగింపబడును. ఒక విషయము ( Subject ) నం దొకరోజు చేయవలసిన పని 'యూనిట్' అనబడును. కాని ప్రతిదినమును ప్రతివిషయము ( Subject ) నందు చేయవలసిన పనిని ఆదినమే ముగింపవలయు ననెడి నిర్బంధము లేదు. ఒక పిల్లవాడు ఒక విషయము ( Subject ) నందే ఆ రోజంతయుగడుపవచ్చును. ఇంకొకడుప్రతివిషయమునకు (Subject ) కొన్ని నిమిషము లియ్యవచ్చును. కాని ఉపాధ్యాయుడు మాత్రము ప్రతి బాలుడు తాను ఒక నెలలో పూర్తి చేయవలసిన పనిని ఆనెల ఆఖరువరకు ముగించునా? లేదా? యని చూచును. ఒకబాలుడొక 'అస్సైన్‌మెంటు' చాల త్వరగా పూర్తి చేయ గలిగినయెడల అతనికి మరికొంత పనియివ్వబడును. కాని ఆ క్రొత్తపని యిచ్చుటకు ముందు అన్ని విషయము ( Subjects ) లలో 'అస్సైనుమెంట్లు'ను పూర్తి చేసినది లేనిది చూడబడును. సామాన్యముగ 75% పిల్లలు తమ పనిని చేయ గలుగుదురు. కాని మిగిలిన వారికి ఉపాధ్యాయుడు కొంత సాహాయ్యము చేయవలసి యుండును.

3826 370 SUM

4. పై చూపులు ( Checks ):— డాల్టన్ ప్లానునందు బాధ్యతయంతయు బాలురపై ననే యుంచబడును గాన వారెంత పని చేయుచున్నది పరీక్షింపవలసి యుండును. వారి పనిని తెలియజేయుటకై గ్రాఫులు ( Graphs ) గీయబడును. ఇట్టి గ్రాఫ్‌వలన ఉపాధ్యాయుడే బాలు డెంతపని చేసినది, ఏస్థానమం

యున్నది సునాయాసముగా నొకదృష్టి దానిపై వేసినంత మాత్ర మునసే తెలిసికొన గలుగును. బాలునకు గూడ తానెంత పని చేసినది, ఇకముం దెంత చేయవలసి యున్నది తెలిసికొనుటకు వీలు గలుగును.

బాలుని విద్యాభివృద్ధి ( Progress ) ని సూచించుటకై మూడు విధములైన ప్రత్యేకపు 'రికార్డు'ల ( Record ) నుంచ వలసి యుండునని మిస్. పార్క్‌హర్స్టు తెలిపెను. ( i ) పిల్లవాని కార్డు ( Scholar's card ), ( ii ) బోధకుని గ్రాఫ్ ( Instructor's graph ), ( iii ) ఇంటిగ్రాఫ్ ( The house graph ). ప్రతిబాలుడు నిత్యము తానెంత పనిచేసినది సూచించుట కేర్పాటు చేయ బడినదియే. పిల్లవాని కార్డు ( Scholar's card ) బాలు రెట్లు పనిచేయుచున్నది తెలిసికొనుటకై ప్రతిదినమీకార్డులు పరీక్షింప బడును. ఒక పిల్లవాడు సక్రమముగ అభివృద్ధి ( Progress ) జెందకయున్న నతనికి ఉపాధ్యాయునితో తగిన సాహాయ్యమును తీసికొని తన లోపమును సవరించుకొనమని సలహా యియ్య బడును. బోధకునిగ్రాఫ్ ( Instructor's graph ) వలన వివిధ విష యము ( Subjects ) లలో బాలు రేస్థానమందున్నది ఒక్కసారి చూచినంత మాత్రముననే ఉపాధ్యాయునకు విశదమగును. ఉపాధ్యాయుడు తన గ్రాఫ్‌ను చూచి ( బాలురగ్రాఫ్‌ను చూడ కయే ) ఏబాలుడు వెనుకబడియున్నది, ఎవరు ముందునకుబోవు చున్నది- చెప్ప సమర్థుడగును. ఇంటిగ్రాఫ్( House graph )సంవ త్సరమందు జరుగుపని నంతయు చూపును. ఇంతియేగాక అన్ని

విషయములలో( Subjects )మొత్తము వివిధ 'గ్రూపు' వారేమి సాధించినదిగూడ సూచించును.

డాల్టన్ ప్లానునం దీ ముఖ్యలక్షణము లుండునని చెప్ప వచ్చును.

(1) ప్రణాళికకొన్ని 'అసైనుమెంట్లు'గా విభజింపబడును'

(2) బాలు రీ 'అసైనుమెంట్సు'ను వారిపై నియమింప బడిన కాలములో ముగించుటకై ఉపాధ్యాయునితో ఒడంబ డిక చేసికొందురు. అట్లొడంబడిక చేసికొనిన తరువాత, తన యిష్టానుసారముగ ఎప్పుడే విషయము ( Subjects )ను చదువ దలచిన యెడల దానిని చదువుట కతనికి స్వేచ్ఛయుండును.

(3) గ్రాఫ్‌ద్వారా పనియొక్క అభివృద్ధి ( Progress ) తెలుపబడుచుండును.

(4) తరగతి గదులమారుగా సబ్జక్టు గదులేర్పాటు చేయ బడును.

డాల్టన్ ప్లానుపై ఆక్షేపణలు. వానికి సమాధానములు:- డాల్టన్ ప్లాను కొన్ని యాక్షేపణలకు గురియగుచున్నది. 'చాలచిన్న వయస్సునందే బాలురపై గొప్పబాధ్యత యుంచబడుచున్నది' యనునది యొక యాక్షేపణ. ఈబాధ్యతవలన బాలుని కెల్లప్పుడు పని నెట్లునియమితకాలములోముగింతునాయనుచింతయుండును. ఇట్టిచింతవలన బాలుని యభివృద్ధి నిరోధింపబడుటయే గాక అతని ఆరోగ్యమునకు గూడ భంగము కలుగవచ్చును. కాని డాల్టన్

స్కూలులో పనిచేయు నుపాధ్యాయులు సామాన్య పాఠశాలలం దుండు బాలురకన్న డాల్టన్‌స్కూలులో చదువు బాలురు ఎక్కువ వ్యాకులతతో నుండరని తెలుపుచున్నారు. ఈప్లానునం దుపాధ్యాయునకు, బాలునకు సన్నిహిత సంబంధ మేర్పడును. గాన బాలు డుపాధ్యాయునిచూచి భయపడక, అతని దగ్గర నెక్కువ చనువుగలిగి తనకుగల కష్టములను నివారించుకొను చుండును. అందువలన నిర్విచారముగ తనపనిని జయప్రదముగ నెరవేర్పజాలును.

రెండవ యాక్షేపణ 'బాలురకు పనిచేయుటయందు మిక్కిలిస్వేచ్ఛ నొసంగిన వారు పనినిబొత్తిగా చేయకయే పోవచ్చును. ఇదియుగాక బాలురకు నీ విధానమువలన తమయిష్టాను సారముగ పనిని చేయునలవాటు కలుగును. ఇట్టి యలవాటువలన వారికి తమ భావిజీవితములం దొకకష్టము నెదుర్కొనవలసి వచ్చును.అది యేదన;ఒకవేళ భావిజీవితమునందు వారి కితరులచేతి క్రింద పనిచేయవలసి వచ్చినయెడల తమయధికారులువిధించినట్లు చేయవలసియుండును. గాని తమయిష్టాను సారముగ పనిని చేయు టకు వీలుండదు.' దీనికి డాల్టన్‌ప్లాను నవలంబించువా రీవిధముగ సమాధానము చెప్పుదురు. బాలురయందు పనిని తప్పించు కొనవలెననెడి కోరిక యుండదు. అట్లుగాక నేర్చుకొన వలయు ననెడి కుతూహల ముండును. కాన వారికి తగిన వాతావరణము, వసతు లేర్పరచిన ఆపనియం దెక్కువ ఆసక్తిచూపుదురు. ఇంతి యేగాక వీరికియ్యబడిన స్వేచ్ఛను దుర్వినియోగ పరచుటకు గూడ వీలుండదు. ఎందువలన నన ఉపాధ్యాయుడు వీ రేలుచేయు

చున్నదియు ఎంతఅభివృద్ధి పొందుచున్నదియు గమనించుచునే యుండును, వీరు సిద్ధపరచు గ్రాఫులవలనకూడ వీరుచేయుపని ఎట్లు జరుగుచున్నదియు తేటతెల్ల మగుచుండును.

కొంతమంది యుపాధ్యాయులు ఈప్లాను మిక్కిలి తెలివిగల బాలురకేగాని మందబుద్ధిగల బాలుర కుపకరింపదని చెప్పెదురు. ఏదైన క్రొత్తవిషయమును పూర్తిగా గ్రహించిన పిమ్మటగాని బాలురు దానికి సంబంధించిన వ్యక్తికార్యమును చేయజాలరు. ఉదా:- గణితమునందొక సూత్రమును బాలురకు బోధించి తరువాత వ్యక్తికార్యమున కవకాశ మిచ్చువల యును. అట్టి అవకాశము డాల్టన్‌ప్లానునందు దొరకదు. ఈ ప్లానునందు ప్రశ్నోత్తరముల కవకాశములేదు. బాలురతో చర్చించి, వారికి విషయము ( Subject ) నందు జ్ఞానము కలి గించుట కవకాశ ముపాధ్యాయున కివ్వబడుటలేదని కొందరి యాక్షేపణ. సరియైన పాఠ్యగ్రంథములు, అసైన్‌మెంట్లు లభిం చుటకష్టమని మరొక యాక్షేపణ. పాఠ్యగ్రంథములలో విష యము తార్కిక క్రమమున నమర్పబడి యుండుటచే నవి ఈ ప్లానుకు సరిపడవు. ఈ విధానమున కుపకరించు పాఠ్యగ్రంథ ములను సిద్ధము చేయవలసి యుండును. డాల్టన్‌ప్లాను ప్రకా రము విద్యగరపు పాఠశాలలో క్రొత్తపాఠ్య గ్రంథములు, అసైన్‌మెంట్లు సిద్ధపరుపబడి ఈ కష్టములు చాల భాగము వరకు తొలగింపబడినవని చెప్పవచ్చును.

<u>డాల్టన్‌ప్లానువలన కలుగు లాభములను</u> క్లుప్తముగా నిట్లు పేర్కొన వచ్చును.

(1) నేర్చుకొనవలె ననెడి సంకల్పము స్వాభావికముగానే పుట్టును.

(2) బాలురు తమ విద్యయందు తామే ఎక్కువ పాల్గొందురు గాన వారికి పాఠశాల జీవితమందు విశేషాభిరుచి కలుగును.

(3) ఈ విధానమువలన వారు తమకియ్యబడిన స్వేచ్ఛను సద్వినియోగపరచుచు, తమయం దుంచబడిన బాధ్యతలను వహింప సమర్థులగుచున్నారు.

(4) ఉపాధ్యాయుడు, విద్యార్థి– వీరిద్దరి మధ్య సన్నిహిత సంబంధమేర్పడుటచే క్రమశిక్ష ( Discipline ) ను బాటింప వలసిన యవసరమే యుండదు.

(5) వివిధ మానసిక శక్తులుగల బాలురకు విద్య నభ్యసించుటకై వారి కనుగుణ్యమగు వసతులు కల్పింపబడును.

(6) తమ పనిని తామే నిర్వహించుకొనుచు, నితరులతో కలిసి మెలసి నొకేచోట యుందురు గాన వారియందు సాంఘిక భావము దృఢపడును.

## హిందూదేశమునం దీప్లానుయొక్క యాచరణము

## (The adoption of the plan in India)

ఇంతవరకు మనము డాల్టన్ ప్లాను సామాన్యముగ నెట్లుం డునో అమెరికా, ఇంగ్లాండు దేశములందు దాని నాచరణము నందు పెట్టినపు డే ముఖ్యసూత్రములు దృష్టియం దుంచుకొనబడునో తెలిసికొంటిమి. మన హిందూదేశమునం దీప్లాను

ప్రకారము ఒక పాఠశాల నేర్పాటుచేయవలయుననిన ఈ క్రింది ప్రతిబంధముల నెదుర్కొనవలసియుండును, ఇందులో ముఖ్యమైనది. (1) భాషా సమస్య (Language problem). ఇచ్చట బాలునకు తన మాతృభాషగాక రాష్ట్రభాష, ఇంగ్లీషు మొదలగు భాషలను నేర్చుకొనవలసియుండును. (2) ఇచ్చట దేశభాషలందు తగు పాఠ్యగ్రంథములు లేకపోవుట. (3) తగిన పాఠశాల భవనములు లేకపోవుట. (4) 'అసైనుమెంట్సు'ను వివిధ విషయము (Subjects) లందన్ని భాషలలో ఏర్పాటు చేయవలసిన యావశ్యకత. (5) ఉన్నత పాఠశాలయందు బోధింపబడు విషయముల (Subjects) సంఖ్య ఎక్కువగా నుండుట. (6) ఉపాధ్యాయులొక స్థానమునుండి మరియొక స్థానమునకు తరుచుగా మార్చుచుండుట. (7) సంవత్సరాంతమున బాలురను పైతరగతికి పంపుటకు నేర్పరచుకొను నిబంధనలలో కాఠిన్యము చూపుట.

ఈ ప్రతిబంధము లున్నంత మాత్రమున నీప్లాను నాచరణయందుంపజాలమని నిరుత్సాహ పడనక్కరలేదు. కొన్ని ముఖ్యమైన విషయములు (Subjects) అనగా గణితము, సైన్సు, చరిత్ర, భూగోళము మొదలగువానిని డాల్టన్ పద్ధతిప్రకారము బోధింపవచ్చును. ఈ విధముగా కొంత కార్యక్రమము డాల్టన్ పద్ధతి ప్రకారము, కొంత పూర్వపద్ధతి ననుసరించి యేర్పరచుట యుత్తమము. దీనికై ఉదయమున బాలురకు డాల్టన్ ప్లానుప్రకారము చదువుకొనుటకు స్వేచ్ఛనొసంగుటయు, మధ్యాహ్నపు గంటల (Periods) లో బాలురందరిని కలిపి సమష్టిబోధనకై

యేర్పాటు చేయుట యుచితము. మనదేశములో నీ ప్లానుప్రకారము విద్యగరపుటకు అక్కడక్కడ కొన్ని ప్రయత్నములు చేయబడుచున్నవి.

సామాన్యమైన ఉన్నత పాఠశాలలకన్న, బోధనాభ్యసన పాఠశాలలం (Training Schools) దీ విధానమును మనదేశమునందు ప్రవేశపెట్టుట కవకాశములు గలవని చెప్పవచ్చును. ఈ పాఠశాలలందు పై నుదహరింపబడిన ప్రతిబంధము లంతగా నుండజాలవు. ఎందువలనన (1) ఇందు అందు రొకేభాషయందు విద్య నభ్యసింతురు గాన భాషాసమస్య యుండనేరదు. (2) సామాన్యముగ ఈపాఠశాలలందు బోధించు నుపాధ్యాయుల కంత ఎక్కువగా మార్పులుండవు. (3) ఇచ్చట గదులెక్కువగను, చదువుకొను విద్యార్థులసంఖ్య తక్కువగను నుండును. (4)వీరి 'కోర్సు' ఒకేసంవత్సరమున ముగియునది గాన సంవత్సరాంతమున 'ప్రమోషన్' సమస్యయుండ నేరదు. (5) ఈ పాఠశాలలందు చదువుకొను వారందరు నయోజనులు, విద్యాబోధనయందు నిపుణత్వమును సంపాదించుకొను కోరెకతో చదువువారు గాన పనిని తప్పించుకొని తిరుగుచు తమస్వేచ్ఛను దుర్వినియోగపరతురను భయ ముండనేరదు. (6) వీరి కుపకరించు పాఠ్యగ్రంథములు తరచుగా మారుచుండవు. గాన ఈ ప్లాను ననుసరించి కొన్ని పాఠ్యగ్రంథములు, 'అసైనుమెంట్సు' ను శ్రమపడి సిద్ధపరచినయెడల దీని నాచరణలో పెట్టుట కవకాశము లభించును. కాన కనీసము బోధనాభ్యసన పాఠశాలలందైన నీ డాల్టన్‌ప్లానును ప్రవేశపెట్టుటకు ప్రయత్నించుట యుచితమని చెప్పవచ్చును.

## తొమ్మిదవ అధ్యాయము



# సమష్టికార్యము ( Group work )

# ప్రాజెక్టు పద్ధతి ( Project method )

సమష్టికార్యము:—తరగతియందుండు బాలురను చిన్న చిన్న గుంపులు ( Groups ) గా భాగించి, వారిచే చేయింపబడు కార్యము సమష్టికార్య ( Group Work ) మనబడును. ఒకగుంపు నం దిద్దరు బాలురు మొదలుకొని తరగతియందున్న బాలురలో సగమువరకుకూడ నుండవచ్చును. ఈసంఖ్య బోధింపబోవు విషయము ( Subject ) మఱియు చేయబోవుపనియొక్క స్వభావము మీాద ఆధారపడి యుండును. ఉదా:— లెక్కలు చేయునపుడు ఇద్దరు బాలుర నొక గుంపునందుంచవచ్చును. వారిద్దరు పుస్తకములను జూచుకొనుచు ఒకరినొకరు ఎక్కములందు గాని, నోటిలెక్కలందుగాని ప్రశ్నించుకొనుచు, వారి సమాధానములు సరిగా నున్నవో లేవో చూచుకొనుచుందురు. పుస్తకపఠనమునందు ( Reading ) ముగ్గురు పిల్లలతో నొక గుంపును చేయవచ్చును. అందులో ఒకడు బాగుగ చదువ గలిగినవాడు మిగిలినవా రిద్దరంత బాగుగ చదువలేనివారు కూడ నుండవచ్చును. బాగుగ చదువగలిగిన పిల్లవా డితరులకు సరిగా

చదువుటలో సాహాయ్యపడును. పాఠశాలా నిర్వాహణము కొరకై కొన్ని గుంపుల నేర్పరచి ఒక గుంపునకు ఆటలనాడుట కేర్పాట్లు చేయుట, మరియొక గుంపునకు పాఠశాల పరిశుభ్రముగ నుంచుటకు తోడ్పడుట, ఇంకొక గుంపునకు పాఠశాలయందు క్రమశిక్ష బాగుగ నుండుటకై సాయపడుట మొదలగు పనుల నియ్యదలచిన పక్షమున నప్పుడొక్కొక్క గుంపునందు బాలురసంఖ్య యెక్కువగా నుండవచ్చును.

సమష్టికార్యమువలని లాభములు:—తరగతిలోని బాలురను కొన్ని గుంపులుగా విభజించుటచే, తరగతియందలి బోధనవలన (Class teaching) గలుగు కొన్ని నష్టముల నుపాధ్యాయుడు పోగొట్ట సమర్థుడగును. ఏలనన ఒక్కొక్క గుంపునందు సంఖ్య తక్కువై యుండుటచే ప్రతిబాలునిపై వ్యక్తిపరముగా శ్రద్ధజూపుట కవకాశములు దొరకును.

వ్యక్తికార్యమువలన నొకానొకప్పుడు సంకుచిత వ్యక్తిత్వ భావము బాలురయం దేర్పడవచ్చును. తరగతియందలి బాలురను గుంపులుగా విభజించుటచే నట్టిదోష మేర్పడుటకు వీలుండదు. కాబట్టి వ్యక్తికార్యమువలన సంభవించునట్టి లోపము ఈ సమష్టి కార్యమువలన తొలగిపోవును. దీనిని బట్టియే గుంపు (Group), వ్యక్తి (Individual) తరగతులకు (Class) మధ్యస్థమైనదని చెప్పవచ్చును.

మంచి తెలివిగల బాలుర నొక గుంపుగాను, అంతకన్న తక్కువ సమర్థతగల బాలురను మరియొక గుంపుగాను, ఈ విధ

ముగ బాలుర శక్తులనుబట్టి తరగతియందలి బాలురను కొన్ని గుంపులుగా విభజించి వారి కుండు జ్ఞానానుగుణ్యముగా బోధన చేయబడును.

గుంపులుగా విభజించుటవలన బాలురు చాల చురుకుగా పనిచేయుదురు. దీనివలనవారికి పనిచేయుట కుత్సాహము కలుగును. ఒకగుంపునందు కొందరు బాలురున్నప్పు డందులో నొక బాలుడు దానికి నాయకుడుగా నుండవలసివచ్చును. కాన సమష్టికార్యము వలన బాలునియందు నాయకత్వము వహించుటకు కావలసిన లక్షణములు సమకూర్చబడును.

గుంపునందు పనిచేయు బాలు డొక యాటయందు తన స్వలాభము నపేక్షింపక తనగుంపుయొక్క జయమునే గోరుచుండును. కాబట్టి సమష్టి కార్యమువలన బాలురయందు స్వలాభమునకై కాంక్షించు నలవా టేర్పడక, తన సంఘము కొరకు పాటుపడు సులక్షణ మేర్పడును.

సమష్టికార్యమువలన బాలురకు సమష్టివాదన (Group-discussion) కవకాశము లభించును. ఒకసమస్యను పరిష్కరించుటకై పెక్కుగుంపులకు చేరినవా రందరొకచోట గుమిగూడి చర్చింప మొదలిడుదురు. ఇట్టిచర్చలో ఒకగుంపునాయకుడు తన గుంపునందలి వ్యక్తుల సాహాయ్యముతో తన అభిప్రాయమును వెలిబుచ్చును. ఈ విధముగ ఒకరి యభిప్రాయముల మరొకరు గుర్తించి సరియైన సారాంశమును నిర్ణయింప సమర్థులగుదురు.

<u>సమష్టి కార్యమువలన నష్టములు:</u>— సమష్టికార్యమునందు బాలురందరికి పనిచేయుటకు సమానమైన యవకాశములు

దొరకవు. సామాన్యముగ నాయకుడే ఎక్కువగ పనియందు పాల్గొనును. కొందరు స్తబ్ధులుగానుండి కార్యనిర్వహణమందెట్టి జోక్యమును కలిగించుకొనక పోవచ్చును.

దీనివలన మరియొక నష్టమేమన సామాన్యముగా నొక గుంపునందు చేర్చబడు బాలురందరొకే ప్రమాణమునకు (Standard) నుండకపోవచ్చును. అనగా కొందరెక్కువ తెలివి గలవారు, మరికొందరు వెనుకబడి యున్నవా రుండవచ్చును. దీనివలన తక్కువజ్ఞానము గలవారికి నిరుత్సాహమేర్పడి కార్యము చేయుటయందు అధైర్యము కలుగవచ్చును.

ఒక గుంపులోని బాలురందరొకే పనిని చేయునప్పుడందులో కొందరికి తాము చేయవలసిన పని స్పష్టముగా వారికి తెలియక పోవుటచే వారితరుల ననుకరించుదురు. దీనివలన వారికి తొట్రుపాటు, తబ్బిబ్బు, చిక్కు కలుగుటయేగాక వారి కాలము ప్రయత్నము తరచుగా వృథాయగును.

సమష్టికార్యమునం దుపాధ్యాయుడు ప్రతి బాలునకు వ్యక్తిపరముగ చూపవలసినంత శ్రద్ధచూపి, వారి తప్పులను సవరింపజాలడు. ఇదియునుగాక దీనివలన బాలురయందు పోటీ, ఈర్ష్యాభావములు జనించి వారు స్వలాభ పరులగుటకు గూడ వీలుండును.

సామాన్యముగ నీ సమష్టికార్యము పెద్దబాలురకు రుచింపక పోవచ్చును. దీనికి కారణమేమన వారు వ్యక్తిపరముగనే కార్యము చేయుటయం దాసక్తిని చూపుదురు. ఈ పద్ధతి

8 సంవత్సరములనుండి 12 సంవత్సరములవరకుండు బాలురకే ఎక్కువ లాభించును. అంతకన్న తక్కువ వయస్సు, లేక ఎక్కువ వయస్సుగల బాలురకు అంత లాభదాయకము గాక పోవచ్చును. ఎందునలన నన వారియందు గుంపులుగా జేరుటకై కాంక్ష పుట్టకుండుటగాని తగ్గిపోవుటగాని జరుగును.

పై నుదహరింపబడిన నష్టములు సమష్టి కార్యమువలన కలుగకుండుటకై ఉపాధ్యాయు డీక్రింది విషయములను సమష్టి కార్యము నేర్పాటు చేయునపుడు గమనింపవలయును.

పనియంతయు నాయకునే చేయనియ్యక, గుంపునందు పనిచేయు బాలురందరు సమముగా పనియందు పాల్గొనునట్లుగా చూడవలయును. ఒకేజ్ఞానముగల బాలురనందరిని సాధ్యమైనంత వరకొక గుంపులో చేర్చవలయును. సమష్టి కార్యమును ప్రారంభించునపుడు గుంపులోని బాలురు తాము చేయబోవు దానిని స్పష్టముగ తెలిసికొనునట్లు చేయవలయును. ఉపాధ్యాయుడు జాగ్రత్తతో గుంపునందుండు బాలురపై పర్యవేక్షణము ( Supervision ) జరుపవలయును. ఒక్కొక్క వ్యక్తిపై దృష్టి యుంచవలయునే గాని వారికి పని నప్పగించి తాను కూర్చొనుట భావ్యముకాదు. వారు పనిని చేయుచున్నప్పుడు తాను వారిదగ్గిరకు పోయి ఎవరెట్లు చేయుచున్నది గమనింపవలయును. సాధ్యమైనంత వరకు బాలురయందు పోటీ, ఈర్ష్యాభావముల నెక్కువగా పెంపొందనీయక వారికి సంఘకార్యములను జేయుట యందాసక్తి కలిగింపవలయును.

పాఠశాలయందు వివిధవిషయములు ( Subjects)బోధించునపుడు సమష్టి కార్యము నెట్లుపయోగించుటకు వీలుకలుగునో విచారించుదము.

విజ్ఞానశాస్త్రము ( Science ) :— ఒక ప్రయోగమును నిద్దరు లేక ముగ్గురు పిల్లలుగలగుంపుచే జేయింపవచ్చును. తరగతి బాలురందరిని కొన్నిగుంపులుగా విభజించి, ఒకగుంపును 'వానకొలత' కు నియమింపవచ్చును. ఒక గుంపును ప్రయోగశాల పరిశుభ్రతకు, మరియొక గుంపును, 'గోడలందు పటములను వేయుటకు' నియమింపవచ్చును. ఈ విధముగ విజ్ఞానశాస్త్రమును బోధించునపుడు బాలురచే సమష్టి కార్యము చేయింపవచ్చును. ఇట్లు చేయించిన పిమ్మట గుంపులుగా విభజింపబడిన బాలుర నందరిని తరగతియందు కూర్చుండబెట్టి ఆయా గుంపుల నాయకులచే తాము చేసిన పనులను క్లుప్తముగా చెప్పింపవలయును. దీనివలన బాలునకు తనగుంపులోని వారు చేసినపనిని తెలిసికొనుటయేగాక తదితరములగు గుంపులలోని బాలురు చేసిన పనినిగూడ నవగాహనము చేసికొనుటకు వీలు గలిగింప వచ్చును.

భూగోళమును బోధించునపుడు తరగతి యందలి బాలురను కొన్ని గుంపులుగా విభజించి కొందరిచే నొక దేశమునందు పర్వతములను సూచించు పటమును గీయింపవచ్చును. నదులు, రైలుమార్గములు, పంటలు, జనసంఖ్యచూపు పటములను వివిధగుంపులచే సిద్ధపరచునట్లు చేయవచ్చును. కొందరిచే

పాఠశాలావరణమునందు నేలమీద పటమును సిద్ధము చేయింప వచ్చును. ఇదేవిధముగ సమష్టి కార్యము నితరవిషయము (Subjects) లందుగూడ నుపయోగింపవచ్చును.

సామాన్యముగా నొక పెద్దతరగతియందు ప్రాజెక్టుపద్ధతి నుపయోగింపవలయు ననిన నాతరగతిని కొన్ని గుంపులుగా విభజించి, ఒక్కొక్క గుంపున కొక చిన్న ప్రాజెక్టు నీయ వచ్చును.

<u>ప్రాజెక్టుపద్ధతి (Project method)</u> :— పురాతన విద్యావిధానము నందుపాధ్యాయుడు బాలునకు కొంత విషయ జ్ఞానమును కలుగజేసెడివాడు. బాలు డా విషయము నర్థము చేసికొనకయే వల్లించెడివాడు. ఆకాలమందు బాలున కెట్టి యాలోచన, హేతువాదమున కవకాశమియ్యబడక పోవుటచే నుపాధ్యాయుడు చెప్పినదానినే ఒప్పుకొని, బాలుడు దానినే కంఠస్థము చేయుచుండెడివాడు. ఈ విధముగ పురాతన బోధన (Old teaching)యందు ఆలోచన కవకాశమియ్యక జ్ఞాపక శక్తికే యెక్కువ ప్రాధాన్యమీయబడుచుండెడిది ఉదా: బాలురచే కొన్నిసముద్రముల, పర్వతముల, ద్వీపకల్పముల పేర్లు వల్లింప జేయబడెడివి. అవి ఎచ్చటనుండునవి, ఎందుకు ప్రాముఖ్యత వహించినవి తెలియకుండెడిది. నవీన విద్యావిధానమునం దట్లుగాక ఆలోచనకు, హేతువాదమున కెక్కువ యవకాశము కల్పింపబడును.

నవీనవిద్యకు పురాతన విద్యకు గల రెండవభేద మేమనగా పూర్వకాలమునం దేదైన విషయజ్ఞానము కేవలము జ్ఞానసంపా

దన కొరకే యియ్యబడుచుండెడిది. ఆధునిక విద్యయందట్లు గాక బాలుని ప్రస్తుతభావిజీవితమున కుపకరించునట్టి జ్ఞానమే యతనికి సమకూర్పబడును.

ఆధునిక విద్యావిధానమునందలి మూడవ ముఖ్యలక్షణము బాలుని కేదైన వస్తువునుగురించి తెలుపునపు డావస్తువును కల్పిత పరిసరములం దుంపక, దానిసహజ వాతావరణము నం దుంచి బోధించుట. ఉదా:- పూర్వకాలమునందు బాలుర కియ్యబడు లెక్కలు వారి నిత్యజీవితమునకు సంబంధించి యుండెడివికావు. ఇప్పుడట్లుగాక వారి నిత్యజీవితమునకు సంబంధించు లెక్కలే వారిచే చేయింపబడును.

పురాతనకాలమందు సూత్రమును మొదలు చెప్పి తదుపరి అభ్యాసమున కవకాశ మొసంగెడివారు. అనగా మొదలు సూత్రములు, తరువాత నుదాహరణము లియ్యబడెడివి. కాని ఆధునిక విద్యావిధానమునం దట్లుగాక మొదలుదాహరణములు, వివరములు దెలిపి, తరువాత సూత్రములు రాబట్టబడును. ఉదాహరణములద్వారా నేర్చుకొనిన సూత్రమును బాలుడు బాగుగా గ్రహించుటయేగాక దాని నుపయోగింప సమర్థుడుగానుండును. కాబట్టి నవీన విద్యావిధానముయొక్క నాల్గవ లక్షణము ఉదాహరణములను ముందుగ దెల్పి తరువాత నిర్వచనములు లేక సూత్రములను నెలిబుచ్చుటయే.

నవీన విద్యావిధానమునందుగల పైన నుదహరింపబడిన నాల్గు ముఖ్యలక్షణములే ప్రాజెక్టు పద్ధతి (Project method) నుద్భవింపజేసిన వని చెప్పవచ్చును. కావున 'ఒకసందిగ్ధకార్యము

(Problematic act)' ను దాని సహజవాతావరణ (Natural-setting) మందు కొనసాగించుటయే 'ప్రాజెక్టు' అనబడును. పైన వివరింపబడిన నాల్గులక్షణము లిందిమిడియున్నవి. ప్రాజెక్టు ఒక కార్యము, సమస్యయునై యుండుటచే అది తన సహజపరిసరములతో జ్ఞాపకశక్తి లేక కంఠస్థము చేయుటతోగాక హేతువాదము ( Reasoning ) తో పరిష్కరింప బడవలసియుండును. ఒకభోజ్యానుకు సిద్ధముచేయుట, గ్రామవీధులను శుభ్రపరచుట, ఒక దుకాణమును ఆటభూమియందు పెట్టుట మొదలగున వన్నియు ప్రాజెక్టున కుదాహరణములు.

ప్రాజెక్టు విధములు:— మూడువిధములైన ప్రాజెక్టులు గలవు.

మొదటివిధపు ప్రాజెక్టునందు బాలునకు ఉపకరణములు (Apparatus) సామగ్రి, ప్రాజెక్టును పూర్తిచేయుటకై సూచనలు ఇయ్యబడును. దీనివలన కలుగు ఫలితము నిత్యజీవితమునందుపయోగపడు నట్టిదైన వస్తువును సిద్ధపరచుటయే. ఉదా:— 'రూళ్ళకఱ్ఱను చేయుట' అను ప్రాజెక్టును బాలురచే చేయించదలచిన యెడల వారికి కట్టె, వడ్రంగి పనిముట్లు, గరుకుకాగితము ( Sand paper ) మొదలగు పరికరములను, దానిని సిద్ధపరచుటకై సూచనలు ఇయ్యబడును.

రెండవ విధమునందు ప్రాజెక్టు కొనసాగించుకొనుటకు సూచనలు, సామగ్రులు, పరికరము లియ్యబడవు. ఉపాధ్యాయుడు సిద్ధపరుపబడవలసిన వస్తువుయొక్క సామాన్యస్వభావ

మును మాత్రమే సూచించును. తదితర విషయములన్నియు బాలురకే వదలివేయబడును. వారే తమ యిష్టానుసారముగ సామగ్రినెన్నుకొని, ఏపద్ధతి నవలంబింపవలయునో, పని నెట్లు పూర్తి చేయవలయునో ఆలోచించుకొందురు. ఉదా:-'చిత్రలేఖనపుబల్ల ( Drawing Board ) ను సిద్ధపరచుట' అను ప్రాజెక్టు నం దుపాధ్యాయుడు చిత్రలేఖనమునం దుపయోగింపబడుటకు తగినబల్లను సిద్ధపరుపుమని బాలురకు నుడువును. బాలురు తమంతట తామే కావలసిన పరికరములను, వస్తువును చేయునపుడు గ్రహింపవలసిన నియమములను తెలిసికొందురు.

మూడవ విధమునందు బాలురే స్వయముగ ప్రాజెక్టు నెన్నుకొనవలసియుండును. ఉపాధ్యాయుడు దానిని పూర్తి చేయు భారమంతయు వారిపైననే యుంచును. ఉదా:-'పాఠశాలయందు దుకాణము నేర్పాటుచేయుట' 'గ్రామమునందేదైన అంటువ్యాధి ప్రబలియున్నప్పుడు దాని బారినుండి తప్పుకొనుటకై వలయు విషయములను గ్రామస్థులకు తెలుపుట' మొదలగునవి.

పాఠశాల ప్రణాళికయందలి విషయము ( Subjects ) లందు ప్రాజెక్టు పద్ధతిని ఉపయోగింపవచ్చును. భూగోళము నందు బాలురచే తమ జిల్లాపటమును ఇసుకతోగాని లేక బంకమట్టితోగాని సిద్ధముచేయించుట, తమజిల్లాయందు ప్రయాణ మార్గములను తెలిసికొనుట, గణితమునం దొకని ఆదాయ వ్యయములను కనుగొనుట మొదలగునవి.

ఒక గృహనిర్మాణమును ప్రాజెక్టుగ తీసికొనిన నందులో పరిణాళికయందుండు వివిధ విషయములు ( Subjects ) అనగా గణితము, చరిత్ర, సైన్సు మొదలగువానికి సంబంధించిన యీ క్రింది చిన్న ప్రాజెక్టుల కవకాశము కలుగును. గృహమునకు కావలసిన స్థలవిస్తీర్ణమును నిర్ణయించుట, నాలుగు గోడల వైశాల్యమును తెలిసికొనుట, గృహనిర్మాణమునకెంత యిటుక, సున్నము, కలప కావలసినది కనుగొనుట మొదలగు గణితము నకుసంబంధించిన చిన్నప్రాజెక్టులను, ప్రాచీనకాలపు గృహనిర్మాణపు పద్ధతుల నెఱుంగుట, ఆధునిక గృహనిర్మాణ పద్ధతుల కనుగొనుట, వివిధ దేశకాల పరిస్థితుల కనుగుణ్యముగా తన నివాసమునకై మానవుడెట్టి గృహము నిర్మించుకొనెనో తెలిసి కొనుట మొదలగు చరిత్రకు జెందిన ప్రాజెక్టులును, 'ఇటుక, సున్నము, గచ్చు, సిమెంటు, పెంకు, ఇనుము, కలప మొదలగు వస్తువుల లక్షణములను, ఉపయోగములను గుర్తెరుంగుట' యను సైన్సుకు సంబంధించిన చిన్న ప్రాజెక్టులను, "గృహనిర్మాణము" అను పెద్దప్రాజెక్టునందు తీసుకొనవచ్చును.

ప్రాజెక్టు పద్ధతివలన లాభములు:— (1) దీనివలన పాఠశాలయందు గరుపబడు విద్యయొక్క ప్రయోజన మూల్యము (Practical value) చాల హెచ్చగుచున్నది. ప్రాజెక్టు పద్ధతి నుపయోగించుటవలన బాలురు సంపాదించు జ్ఞానము, నిపుణత స్పష్టముగ నుండి వారు వానిని క్రొత్త పరిస్థితులందు గూడ నుపయోగింప సమర్థులగుదురు.

(2) ఒక వస్తువును ఆచరణపూర్వకముగా సాధింతురు. గాన బాలురకు తాము చేయు పనియం దెక్కువ అభిరుచి యుండును. ఇట్టి యభిరుచి వలన వారు ఆ పనియందే నిమగ్నులైయుండి విద్యావంతు లగుదురు.

(3) ఒక ప్రాజెక్టు నుద్దేశించి, నెరవేర్చుట వలన బాలురకు అమూల్యమైన అనుభవము కలుగును. ఇట్టి యనుభవము వలన వారియందు దూరదృష్టి, ఉపజ్ఞ, ( Originality ) మొదలగు సులక్షణము లేర్పడును.

(4) ఒక ప్రాజెక్టును పూర్తిచేయుటకై బాలురు స్వయముగా నెన్నియో పుస్తకములను చదువుదురు. వస్తువులను పరిశీలింతురు. దానివలన వారు పాఠశాలయందు బోధింపబడు వివిధవిషయముల (Subjects) ప్రాముఖ్యతను గుర్తింపగలుగుదురు.

(5) సహనముతోను, క్రమపద్ధతి ననుసరించి బాలురు పనిచేసిననేగాని వారు చేపట్టిన ప్రాజెక్టు పూర్తికానేరదు. ఇందు వలన బాలురయందు ఓర్పు, క్రమపద్ధతిపై పనిచేయు నలవాట్లు అలవడును.

(6) కొన్ని ప్రాజెక్టులందు కొందరు పిల్లలు కలసి పాల్గొందురు. గాన వారియందు నాయకత్వము, సహకారము, మంచి క్రమశిక్ష, పనిని పంచుకొనుట మొదలగు మంచిలక్షణము లేర్పడును.

ప్రాజెక్టు పద్ధతివలన కొన్నినష్టములు గూడగలవు. అవి యేవన ? (1) ఈ పద్ధతివలన బాలుడు క్రమపద్ధతి ననుసరించి జ్ఞానమును సంపాదింపజాలడు. అతడు తన ప్రాజెక్టునకు సంబంధించిన విషయములను మాత్రమే తెలిసికొని తదితరములను వదలివేయును. అందువలన అతని జ్ఞానమునందు కొన్ని కొరతలు ( Gaps ) ఉండును. ఈ కొరతల నాబాలుడు తన జీవితమునందంతయు పూర్తి చేసికొనజాలక పోవచ్చును. ఇంతియే గాక అతని కేశాస్త్రమునందును సక్రమమగు విశేషజ్ఞానముండజాలదు.

(2) ప్రాజెక్టు లెంత చాకచక్యముతో నెన్నుకొనబడినను, పాఠశాల ప్రణాళికయందున్న విషయము ( Subjects ) లన్నియు నందు రాజాలవు. కొన్ని విషయముల ( Subjects ) కు సంబంధించిన జ్ఞానము నుపయోగించు నవకాశము పాఠశాల ప్రాజెక్టులం దుండనే యుండదు.

(3) పాఠశాలను పూర్తిగా ప్రాజెక్టు పద్ధతి ప్రకారముగా నడపుచు వచ్చిన బాలురకు తాము తెలియక చేసిన తప్పులను గుర్తెరుంగుట కవకాశముండదు. దీనికి కారణము ఉపాధ్యాయునినుండి కావలసినంత బోధనాసాహాయ్యము లభింపక పోవుటయే యనవచ్చును.

(4) ప్రాజెక్టునందు బాలుర దృక్పథము ముఖ్యముగా పనిని త్వరగా నియమిత కాలమునందు ముగించుటయందే యుండవచ్చును. కాని విద్యాభ్యాసనమునం దంతగా నుండక

పోవచ్చును. ఇట్టి దృక్పథము బాలురను తమ పనిని తొందరగా ముగించుటకై పురిగొల్పును. దీనివలన నుత్తమ ఫలితములు చేకూరక పోవచ్చును.

ప్రాజెక్టు పద్ధతి నొకదానిపైననే విద్యావిధానమంతయు ఆధారపడి యుండునట్లు చేయుట యుచితము కాదని చెప్పవచ్చును. ఇతర పద్ధతులను గూడ ఈ పద్ధతితో పాటు ఉపయోగించుట సమంజసము. కాబట్టి బాలురకు సంవత్సరము మొత్తముమీద కొలదికాలమువరకు కొన్ని ప్రాజెక్టులను పూర్తి చేయుట కవకాశమిచ్చి, మిగిలిన కాలమునం దితర పద్ధతుల నుపయోగించి విద్యగరపుట ఉత్తమమని చెప్పవచ్చును.



# పదియవ అధ్యాయము



# విద్యామూల్యములు

# ( Educational Values )

ప్రణాళిక నేర్పాటు చేయుటకు ముందు దానిలో చేర్పవలసిన విషయముల ( Subjects ), విద్యామూల్యముల నెరింగియుండవలయును. ప్రతివిషయము ( Subject ) నం దె న్ని యో విలువ లుండును. అందులో కొన్ని ముఖ్యమైనవి. మఱికొన్ని సాధారణమైనవిగా నుండును. ఈ విలువల నెరింగి యుండిననేగాని ఉపాధ్యాయుడు తాను బోధించు పాఠముల యందు బాలురకెక్కువ శ్రద్ధాభిరుచులను కలిగింపజాలడు.

<u>విషయములయొక్క విద్యామూల్యములు</u> మూడు విధ ములు. (1) సహాయమూల్యము ( Instrumental value ), (2) సంస్కృతి మూల్యము ( Cultural value ), (3) శిక్షణా మూల్యము ( Formal value ).

1. సహాయమూల్యము (Instrumental value):— కొన్ని విషయములు ( Subjects ) పాఠశాలలందు నే యుద్దేశములను దృష్టియం దుంచుకొని బోధింపబడునో, ఆ యుద్దేశములనేగాక మరి యితరయుద్దేశములను సాధించుటయందుగాని లేక యితరా వసరములను పూర్తి చేసికొనుటయందుగాని అవి సాహాయ్య పడును. ఉ:—పాఠశాలయందునేర్పబడు <u>మాతృభాష</u> బాలురకు తమ భావములనుఇతరులకు తెలియజేయుటకుగాని లేక యితరుల

భాషములు తాము తెలిసికొనుటకుగాని సాహాయ్యపడును. గణితము నేర్చుకొనుటవలన బాలుడు తమ నిత్యజీవితమునందు ఇచ్చి పుచ్చుకొను వ్యవహారములందు మోసపోకుండనుందురు. కాన మాతృభాష, గణితమునందు సాహాయ్యమూల్యము గలదని వెల్లడియగుచున్నది. విద్యావేత్తలుసాహాయ్యమూల్యము నీక్రింద నుదహరింపబడిన అయిదు విధములుగ నుండునని తెలుపుచున్నారు.

(1) పరిచయమూల్యము ( Introductory Value ):— ఈ విలువగల విషయములు ( Subjects ) ఇతర విషయములకు గావలసిన జ్ఞానమును సమకూర్చుటచే ఆ విషయములను నేర్చుకొనుట సులభమగును. ఉదా:-ప్రకృతి పఠన పరిచయమువలన వృక్ష, జంతు, ఖగోళ, రసాయన శాస్త్రముల నేర్చుకొనుట సుళువగును. మాతృభాష, యితరభాషల నేర్చుకొనుటకు సాహాయ్యపడును, ఈ విధముగ నీ విషయములు బాలురను ఇతర విషయముల నేర్చుకొనుటకు సిద్ధపరచును గాన వీని యందు సిద్ధపరచు విలువ ( Preparatory Value) గూడ గల దని చెప్పవచ్చును.

(2) ఆచరణమూల్యము (Practical Value ):—దీనినే ప్రయోజనమూల్య (Utilitarian Value) మని గూడ యందురు. కొన్ని విషయములు ( Subjects ) నేర్చుకొనిన యెడల నవి జీవితములో చాల నుపయోగపడును. అట్టి విషయముల ( Subjects)యందుండు ప్రయోజనమూల్యమును గమనించియే

వానిని తప్పక బాలురకు నేర్పవలసియుండును. ఉదా:— మాతృభాష, లెక్కలతో మన జీవితమునందు అనుక్షణము పనిబడుచుండును. లెక్క తెలియనివాడు బజారులో ఎంత చులకనగా మోసగింపబడునో వేరే చెప్పనక్కరలేదు. భూగోళ శాస్త్రము, వివిధ దేశముల పంటలను, రాకపోకలమార్గములను వ్యాపారము చేయుటకు వసతులను తెలిపిన భావిజీవితము నందు ప్రయోజనకారియగును.

(3) నైతిక మూల్యము ( Moral Value ) :—కొన్ని విషయములు, వానిని చదువు వారియందు మంచిశీలము, మంచి యలవాట్లు కలుగచేసిచెడుకార్యములం డసహ్యము కలిగించును. ఇట్టి విషయము ( Subjects ) లందు నైతికమూల్యముండును. నీతి శాస్త్రము, చరిత్ర, సారస్వతము, ప్రకృతి పఠనము మొదలగు విషయములం దీ విలువఎక్కువగా కానుపించును.

(4) సభామూల్యము ( Conventional Value ) :—కొన్ని విషముల ( Subjects ) ను నేర్చుకొనుటవలన సభయందు పూజ్యత, గౌరవము లభించును. ఇట్టి విలువగల విషయముల ( Subjects ) నెఱుంగనివా డనాగరికుడుగా భావింపబడును. ఈ విలువ సంగీతము, సారస్వతము, సైన్సు, భూగోళశాస్త్రము, మొదలగువాని యం దెక్కువగా కానుపించును.

(5) సాంఘికమూల్యము ( Social Value ):—కొన్ని విషయములు బాలురకు భావిజీవితమునందు సంఘమునం దుండు దురాచారములను బోగొట్టిసంఘోద్ధరణకై పాటుబడుటకు సమ

ర్థునిగా జేయును. ఉదా:- వైద్యశాస్త్రము, సైన్సు మొదలగునవి. వీనియందు సాంఘికమూల్యము ఉండును.

(ii). సంస్కృతిమూల్యము ( Cultural Value ):-కొన్ని విషయములు ( Subjects ) ఏవైన ప్రత్యేకలాభము దృష్టియందుంచుకొని నేర్చుకొనబడక కేవలము వానివలన కలుగు సంతోషము, మనోవికాసము లేక బుద్ధిసూక్ష్మతకొరకే చదువబడును. ఉదా:- నవలలు, నాటకములు, సారస్వతము, లలితకళలు మొదలగునవి. వీనియందు సంస్కృతిమూల్య ముండును.

సంస్కృతి మూల్యములు (i) ఉద్రేకమూల్యము (ii) జ్ఞానమూల్యము అని రెండువిధములుగ నుండును.

(i) ఉద్రేకమూల్యము:— కొన్ని విషయముల ( Subjects ) ను పఠించిన మనోరంజకముగ నుండుటయేగాక ఒక విధమైన ఉద్రేకపూరితమగు సంతోషము కలుగును. ఉదా:- ఒక మంచికీర్తన విని తన్మయత్వము చెందుదుము. ఒక నవల చదువునపుడా నవలలో వర్ణింపబడిన కథానాయకుడుగాని లేక నాయికగానిపొందునట్టి కష్టములకు చాలనొచ్చుకొందుము. ఎట్టి కఠినహృదయమునైనను మంచికంఠస్వరము కరగించును. ఒక మంచి చిత్రపటమును జూచి విస్మయమొందుదుము. కాన వీనియందు ద్రేకమూల్యము గలదని చెప్పవచ్చును.

(ii) జ్ఞానమూల్యము ( Knowledge Value ):— కొన్ని విషయములు చదువుటవలన బుద్ధిసూక్ష్మతకలిగి యనవసరమైన

పిచ్చియపోహాలందు మనస్సును లగ్నము గానీయకుందుము. కొన్ని శాస్త్రముల పఠనమువలన సృష్టియందు గలుగుమార్పులను, అందుగల చిత్ర వైచిత్రములను తెలిసికొని పిచ్చి నమ్మకములకు గురికాకుండా నుందుము. ఉదా:—సైన్సునందారి తేరినవాడు స్ఫోటకము, కలరా మొదలగు వ్యాధులను దేవతలనుగా భావించి కొలుపులు కొలుచుట కొప్పుకొనడు. అజ్ఞానుల కావ్యాధులు కలుగు కారణములను దెల్పి, వానినుండి తప్పించుకొనుటకు మార్గములను సూచించును. ఇట్లే రసాయన, భూగోళ, ఖగోళ శాస్త్రములు చదువుటవలన బుద్ధిసూక్ష్మత కలిగి పిచ్చి అపోహాలకు మానవుడు భయపడడు. ఉదా:—ప్రయాణమగు నపుడు తుమ్ముటచేతగాని, లేక బయలుదేర బోవునపుడు పిల్లి ఎదురుపడుటవలనగాని భయపడడు. ఈ శాస్త్రములయందు జ్ఞానమూల్యమెక్కువగా నుండును.

(iii) శిక్షణామూల్యము (Formal Value):— పూర్వకాలమందు కొందరు విద్యావేత్తలు గణితము, చరిత్ర, విజ్ఞానశాస్త్రము మొదలగు కొన్ని విషయములను (Subjects) చదువుటవలన మానసికశక్తులకు శిక్షణము గలుగునని యభిప్రాయపడెడివారు. అనగా వానియందు శిక్షణమూల్యముండునని భావించెడివారు. ఈ మూల్యముండుటచే లెక్కలు, రేఖాగణితము వలన వృద్ధిబొందిన హేతువాదన (Reasoning) శక్తిని, బాలురు భావిజీవితమునందు వ్యాపారమునకు సంబంధించిన వ్యవహారములలోగాని, న్యాయవాద వృత్తియందుగాని బాగుగ నుపయోగించుకొన వచ్చుననియు, చరిత్రపఠనము వలన వృద్ధి

పొందిన కల్పనా (Imagination) శక్తి భావిజీవితమునందు రాజ్యాంగ విషయములను పరిష్కరించుటలో తోడ్పడుననియు, విజ్ఞానశాస్త్రమందు ప్రయోగములను చేయుటవలన వృద్ధి పొందిన పరిశీలనాశక్తి పోలీసు ఉద్యోగమునందు చేయవలసిన రహస్య పరిశోధనలందు బాగుగ సాహాయ్యపడునని చెప్పెడివారు. ఈ విధముగ ఒకవిషయము (Subject) వలన ఏదైన మానసికశక్తికి శిక్షణము గరపిన యెడల అట్టి శిక్షణము భిన్నమైన యితర విషయములందు గూడ సాహాయ్యపడునని తలంచెడివారు.

ఆధునిక కాలమందు థార్న్‌డైక్ (Thorn Dike), వుడ్‌వర్త్ (Wood Worth), మొదలగు విద్యావేత్తలు వివిధప్రయోగములను సల్పి, ఒక విషయము (Subject) నభ్యసించిన ఎడల దానివలన కలుగు శిక్షణము, తదితరవిషయములు (Subjects) నేర్చుకొనుటలో పూర్వీకు లనుకొనినట్లు విశేషముగా సంక్రమించి సహాయపడునని నమ్మక, విషయములు (Subjects), అవి నేర్చుకొను పద్ధతులు (Methods), వాని ఉద్దేశములు (Aims), సామాన్యము (Common)గా నున్నంతవరకే శిక్షణాసంక్రమణము కలిగి తోడ్పడునని సూచించిరి.

## పదునొకండవ అధ్యాయము



# విద్యా ప్రణాళికా నిర్మాణము

## ( Curriculum making )

బాలుడు తన జీవితము నర్థము చేసికొనవలయుననిన తన పూర్వీకు లార్జించినట్టి జ్ఞానమునంతయు తెలిసికొనుట యత్యావసరము. పాఠశాలయందు బాలున కతని పూర్వీకులు సంపాదించిన జ్ఞానానుభవములు క్రమముగా జెందజేయబడును. ఇట్టి పూర్వార్జిత జ్ఞానధనమును పాఠశాల విద్యాప్రణాళిక మూలమునసే బాలురకు నందజేయును. కాబట్టియే విద్యాప్రణాళిక మానవజీవిత సంగ్రహమనియు, సాంఘికాదర్శములను ప్రదర్శించున దనియు చెప్పవచ్చును. ఒకసంఘము తమపిల్లల కెట్టిజ్ఞానమును సమకూర్ప సంకల్పించు కొనినదియు, భావిజీవితమునందు వారి నెట్టి వారలనుగా సిద్ధముచేయ దలచుకొనినదియు, దానిచే నేర్పాటు చేయబడిన విద్యాప్రణాళికవలన తేటతెల్లమగును. ప్రతిసంఘము తన యాదర్శములను దృష్టియందుంచుకొనియే ప్రణాళిక నేర్పాటు చేయును. ప్రతికాలమందును విద్యా ప్రణాళిక ఆకాలపు సంఘజీవితమును ప్రతిబింబింప జేయును. కావున ప్రణాళికకును, ఉపాధ్యాయునకు గల సంబంధ మెట్టిదో విద్యాప్రణాళికను నిర్మించునపు డేసూత్రములను దృష్టియందుంచుకొనవలయునో విచారించుదము.

<u>ఉపాధ్యాయునకు ప్రణాళికకు గల సంబంధము</u>:- విద్యా ప్రణాళికను నిర్మించునపు డుపాధ్యాయుని యభిప్రాయము సామాన్యముగా తీసికొనబడదు. సంఘమందలి రాజ్యాంగ వేత్తలు, విద్యావేత్తలు, సంఘసంస్కర్తలు మొదలగువారిచే ప్రణాళిక సాధారణముగా సిద్ధము చేయబడును. కాబట్టియే దీని నిర్మాణమునం దుపాధ్యాయుని కెట్టిజోక్య ముండదు. నిర్మిత ప్రణాళిక ప్రకారము పని జేయుటయే ఉపాధ్యాయుని విధి. ప్రణాళిక నిర్మాణమునందు తనను సంప్రదింపకున్నను, దాని నిర్మాణ వివరములను గురించి పూర్తిగా తెలిసికొనుట ఉపాధ్యాయునకు ముఖ్యావసరము.

ఉపాధ్యాయుడు తా నుపయోగించు ప్రణాళిక ఏయుద్దేశములను దృష్టియం దుంచుకొని విద్యావేత్తలు నిర్మించిరో, ఏ విషయము ( Subject ) ప్రణాళికయం దేల చేర్చబడినదో యా యా వివరములను తప్పక గ్రహించుకొని యుండవల యును. అట్టి వివరములు అతనికి దెలియనిచో నేదేని విషయము ( Subject ) ప్రణాళికయం దేయుద్దేశములను దృష్టియందుంచు కొనబడి చేర్చబడెనో యా యుద్దేశములను బోధనయందు సాధింపజాలడు.

ఇదియుంగాక పిల్లల తలిదండ్రులకు ప్రణాళికయం దేదైన విషయ ( Subject ) మెందుకు చేర్చబడినదని సందేహము కలిగి నను లేక ఆ విషయమును పాఠశాలయందు బోధించుటకు వారి కభ్యంతరమున్నను, ఉపాధ్యాయుడే విద్యాశాఖా ప్రతినిధిగా నుండి, ఆ విషయ ( Subject ) మే యుద్దేశములను దృష్టియం

దుంచుకొని ప్రణాళికయందు చేర్పబడినదో వివరించి, వారి సందేహములను పోగొట్టి, విద్యాశాఖ ఘనతను ప్రజాసామాన్యమునకు వెల్లడించును. కనుక ఉపాధ్యాయునకు బ్రణాళికా నిర్మాణ వివరములు బాగుగ తెలిసి యుండవలయును.

<u>ప్రణాళికానిర్మాణ ముఖ్యసూత్రములు:—</u> ప్రణాళిక నేర్పాటుచేయనప్పుడీక్రింది ముఖ్యసూత్రములను పాటింపవలసి యుండును.

(1) భద్రతాసూత్రము ( Principle of conservation )
(2) సృష్ట్యాత్మకసూత్రము (Principle of creativeness)
(3) జీవిత సంసిద్ధతా సూత్రము ( Principle of preparation for life )
(4) కార్యాచరణ సూత్రము ( Principle of activity )

<u>(1) భద్రతాసూత్రము (Principle of conservation):-</u> వంశపరంపరలనుండి కృషిచేసి, మానసిక పరిశ్రమలచే మానవుడు సంపాదించిన యనుభవములు విద్యారూపమున భద్రపరచి యుంచబడుచున్నవి. ఈ యనుభవములు పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, జంతు, వృక్షశాస్త్రములు, చరిత్ర, నీతిశాస్త్రము, గానము, చిత్రలేఖనము మొదలగు నెన్నియో శాస్త్రములకు సంబంధించియుండును. ఇట్టి వంశపరంపరాగత విద్యాధనము మన పూర్వీకులనుండి మనకు లభించుచున్నది. సంఘాభివృద్ధితోపాటు విద్యాధనము కూడ వృద్ధిబొందుచుండును. ఇట్టి పూర్వార్జిత విద్యాధనమును పొం

దుట ప్రతిబాలుని జన్మహక్కై యున్నది. కాబట్టి యిట్టి సొత్తును జాగ్రత్తగా భద్రపరచి యుంచి రాబోవు సంతతికి చెందజేయుట సంఘముయొక్క ముఖ్యవిధి. అందుచేతనే ప్రతి సంఘము ప్రణాళికను సిద్ధపరచునపు డీభద్రతాసూత్రమును దృష్టియం దుంచుకొనును. అనగా ప్రతిసంఘము ప్రణాళికను నిర్మించునపుడు తన స్వాధీనమందున్న వంశపరంపరాగత విద్యాధనమును దృష్టియందుంచుకొని, వివిధ వయస్సునకు జెందిన బాలురకు వారి వారి యవసరములకు తగిన యంశముల నెన్నుకొని ప్రణాళికయందు జేర్చును. కావుననే ఈ దృక్పథము ననుసరించి మన పూర్వీకుల యాచారములను, శీలమును, జ్ఞానమును, సంస్కృతిని భద్రపరచుటయును, సంక్రమింపజేయుటయును పాఠశాల ముఖ్యకర్తవ్యములని చెప్పవచ్చును.

ఈ భద్రితాసూత్రము ననుసరించి ప్రణాళిక నేర్పాటు చేయునపు డొక యంశము తప్పక గమనింపవలసియుండును. అదేమన, పూర్వీకుల యనుభవము లన్నిటిని తూచాతప్పకుండ సంక్రమింపజేయక, బహుజాగరూకత వహించి, వానినుండి యుపయోగకరమగు వానినే ఎన్నుకొనవలయును. ఏ యనుభవములను పొందజేసిన సంఘమునకు లాభమగునో, ఆ యనుభవములను సమకూర్చు విషయములకే ( Subjects ) ప్రణాళికయందు స్థానమియ్యవలసి యుండును.

పూర్వకాలమునందు ప్రణాళిక నిర్మాణమందు బాలుని ప్రస్తుత జీవితావసరములను దృష్టియందుంచుకొనక, భావిజీవితమునం దతని కేవిషయములతో సంబంధముండునో వానినే

చేర్చెడివారు. ఆధునిక కాలమం దట్లుగాక బాలుని ప్రస్తుత జీవితావసరములకే ప్రాముఖ్యతమునిచ్చి బాలకునే పాఠశాలకును, విద్యకును కేంద్రముగానుంచుటకు ప్రయత్నించుచుదురు. గాన ప్రణాళిక నిర్మాణమునందు గూడ బాలునే కేంద్రముగానుంచుట సమంజసము. కాబట్టి విద్యా ప్రణాళిక నిర్మాణమునం దీభద్రతా సూత్రమును బాలుర వయో మానసిక కావస్థల ననుసరించి, వారి పూర్వీకులు సంపాదించిన జ్ఞానానుభవములు వారికి జెంద జేయవలయును.

(2) సృష్ట్యాత్మక సూత్రము (Principle of creativeness) బాలురయందు సృష్ట్యాత్మక ( Creative ) మఱియు నిర్మాణ ( Constructive ) శక్తులుండును. బాలురయం దీశక్తు లెట్లభివృద్ధి పొందునో విచారించుదము.

నాలుగు సంవత్సరముల వయస్సు వచ్చినతరువాతసృష్ట్యాత్మక కల్పన ( Creative imagination ) బాలురయందు ప్రారంభమగును. ఈ కల్పన పిల్ల లాడుకొనునట్టి వివిధక్రీడలలో కానుపించును. దీనివలననే పిల్లవాడు కఱ్ఱను కాళ్ళమధ్య నిడుకొని గుఱ్ఱమునుగా భావించును. కొన్నియిటుకలతో రైలుబండిని సిద్ధపరచును. ఇంతియేగాక ఒకబాలుడు దినమునం దెన్నియో పాత్రములను ధరించుచుండును. కొంతసేపు తానుడాక్టరై రోగులను పరీక్షించును. మరికొంతసేపటికి పోలీసుజవానుగా మారి దొంగలను బట్టుకొనును. ఈ విధముగా బాలు రీవయస్సులో సూహాప్రపంచమం దోలలాడుచుందు.

వయస్సు హెచ్చినకొలది వారి యుపలబ్ధుల( Percepts) సంఖ్య యెక్కువగుచుండుటవలన మానసిక చిత్రములు కూడ నెక్కువయై కల్పనకు తగిన సామగ్రి ఎక్కువగా సమకూరును. 5, 7 సంవత్సరముల వయస్సువరకు కల్పిత కథలయందు బాలురకు నెక్కువ ఆసక్తియుండును. తరువాత నిజమైన కథకును, కల్పితకథకును గల తారతమ్యములను గ్రహింప మొదలిడుదురు. యౌవనారంభదశయం దేదియో యొకయుద్దేశమభివృద్ధియగుట మొదలైన తమకు నచ్చిన విధమున బాలురు సృష్ట్యాత్మక శక్తి నుపయోగించుచుందురు.

పిల్లవానియందు నిర్మాణశక్తి కూడ క్రమేణ యభివృద్ధి పొందుచుండును. చిన్నపిల్లవాడు కఱ్ఱముక్కలతో ప్రహారీలు, ఇండ్లు మొదలగునవి నిర్మించును. పెద్దపిల్లవాడు పనిముట్ల నుపయోగించి తన క్లిష్టమైన పడవలు, పెట్టెలు, కత్తులు, గాలిపటములు మొదలగున వెన్నియో సిద్ధపరచి సంతోషించును. వయోజనులు కూడ తమ తెలివితేటలను, నిపుణత్వములను ఏదైన వస్తువును చేయుటయందు చూపగోరుదురు. కాబట్టి బాలురయందుండు నీ సృష్ట్యాత్మక, నిర్మాణశక్తుల నభివృద్ధి పరచుటకు తోడ్పడునట్టి విషయ( Subjects )ములను ప్రణాళికయందు చేర్చవలయును.

ఈ సృష్ట్యాత్మక సూత్రమును దృష్టియందుంచుకొనియే ప్రణాళికయందు చేతిపనులు, చిత్రలేఖనము చేర్చుటవలనబాలురందు సృష్ట్యాత్మకశక్తి నభివృద్ధిపరుపవచ్చును. ఒక వస్తువును చూపి దానిలో కొంతమార్పును కలిగించి చేయుమనుటవలనను

లేక చిత్రించుడనుట వలనను వారి సృష్ట్యాత్మక, నిర్మాణశక్తులు పెంపొందును. ఇంతియేగాక వ్యాసరచన, ప్రకృతిపఠనము, భూగోళశాస్త్రము, రేఖాగణితము మొదలగు వానినిగూడ ప్రణాళికయందు చేర్చి వానియందు 'హ్యూరిస్టిక్' పద్ధతిద్వారా బాలురకు క్రొత్త క్రొత్త విషయములను, సూత్రములను నేర్పి, మనము వారి సృష్ట్యాత్మక, నిర్మాణశక్తులను, వృద్ధిపరుప వచ్చును.

ఒకవస్తువును గుఱించి కేవలము నోటిమాటలతో నేర్చుకొనుటకన్న దానిని స్వయముగా చేసి యనుభవించి చూచుట వలన నెక్కువ జ్ఞానము కలుగును. సహజముగా మనము వస్తువుల వర్ణనలను వినుటకన్న వానిని సృష్టించుటయందే అపరిమితమైన సంతోషమును బొందుదుము. చేతిపనుల నిందువలననే ప్రణాళికయందు చేర్చుదురు.

ప్రణాళికయందు చేర్చబడు విషయములు ( Subjects ) బాలురయొక్క సహజాభిరుచుల నభివృద్ధిపరచునవియేకాక వారి విరామకాలమును సద్వినియోగ పరచుటకు తగినవిగా నుండవలయును. సృష్ట్యాత్మక క్రియ( creative work )కు వీలున్నంత వరకు ప్రతి విషయము( Subject )న కవకాశము కల్పింపవలయును. ప్రాథమిక పాఠశాల ప్రణాళికయందు చేతిపనిని ( Hand craft ) కేంద్రముగ నుంచుట కిదియే కారణము. ఈవయస్సునందే బాలురు పదార్థములనుపయోగించుటయందు, వస్తువుల నిర్మించుటయం దాసక్తి చూపుదురు. కాబట్టి చేతిపనుల ప్రణాళికయందు ప్రవేశపెట్టుట కిదియే మంచితరుణము. ఇట్లు

చేయుటవలన మనము బాలుర భావిసృష్ట్యాత్మక జీవితమునకు మంచి పునాది నేర్పరచినవార మగుదుము. ఇట్లు చేయజాలకున్న వారి సృష్ట్యాత్మక శక్తు లభివృద్ధి పొందు నవకాశము తొలగి పోవుటయేగాక జీవితాంతమువరకు నాశక్తులను వృద్ధిపొందు నట్లు చేయజాలము.

౩. జీవిత సంసిద్ధతాసూత్రము (Principle of Preparation for life) 'పాఠశాలయందు బాలుడు నేర్చుకొనునది, చేయునది యతనిని జీవితమునకు సిద్ధపరచునదియై యుండవలయును' అను నిదియే జీవిత సంసిద్ధతాసూత్రము. విద్యాప్రణాళికను నిర్మించునప్పుడీ సూత్రమునుగూడ దృష్టియం దుంచుకొన వలయును. పూర్వకాలమందు జీవితమునకు సిద్ధపరచుటయన భావి జీవితమునకు సిద్ధపరచుటగా నెంచబడెడిది. ఇంతియేగాక బాలుని వ్యక్తిత్వమునకు పూర్తిగా తోసిరాజు చెప్పి భావిజీవితావసరములనే దృష్టియందుంచుకొని విద్యగరుపబడెడిది. అనగా అతనికిముందు జీవితమునందే విషయములతో పనిబడునో వానినే బాల్యదశయందు నేర్పెడివారు.

ప్రాచీనకాలమందుపాధ్యాయులు చదువుకొను బాలుర నైజమును, మనశ్శక్తులను, సహజాభిరుచులను పాటింపక వారికి పెద్దల కుపయుక్తమగు విషయములనే నేర్పుచుండెడివారు. ఇప్పుడా కాలము మారినది. ఈ శతాబ్దమునందు శిశుతత్త్వ విచారమున (Child study) కెక్కువ ప్రాముఖ్యత కలిగినది. ఇప్పుడు బాలుని వ్యక్తిత్వ నైజములు వేరువేరుగా భావింపబడు చున్నవి. భావిజీవితమునకు పనికివచ్చు విషయముల నేర్పుటకు మారుగా

అతనికి ప్రస్తుతజీవితమునందు రుచించు విషయములే బోధింప బడుచున్నవి. కాబట్టి ప్రణాళికను సిద్ధపరచునపుడు బాలుని వ్యక్తిత్వము ( Individuality ), నైజము ( Nature ) ఈ రెంటిని గమనించుట యత్యావసరము. కాబట్టియే ప్రణాళికయందు చేర్చబడు విషయములు బాలుని భావిజీవితమునకు సిద్ధపరచునవిగాను, అతని నైసర్గిక ప్రవృత్తులకు తగియున్నవిగా నుండ వలయును.

బాలుడు తన బాల్యదశను జయప్రదముగ గడపిననే గాని తన భావి, కౌమార, యౌవన దశలకు జెందిన జీవితములకు సంసిద్ధుడు కాజాలడు. బాల్యదశయం దతనియందు గల శక్తులకు సంపూర్ణ వికాసము కలిగించు పనుల నతనిచే చేయించిన యెడల, నా దశతరువాత వరుసగా గడుపవలసిన దశలకును, తదుపరి విశాల ప్రపంచమునందు తన భావిజీవితమును జయప్రదముగా గడుపుకొనుట కతనిని సిద్ధపరచినవార మగుదుము.

జీవితమునకు సంసిద్ధపరచు సూత్రమును దృష్టియందుంచుకొని ప్రాథమిక పాఠశాలకు తగిన ప్రణాళిక నేర్పాటు చేయదలచినపుడు మనము ఆ దశయం దుపయోగపడు విషయములనే ( Subjects ) చేర్చవలయునుగాని తరువాత రాబోవు దశలకు బాలుని సిద్ధపరచు ననెడి యుద్దేశముతో నేవిషయము ( Subjects ) లను చేర్చుట యంతగా నుత్తమ మనుపించదు. చిన్న తరగతులకు సంబంధించియున్న విద్యాప్రణాళికను సిద్ధపరచునప్పుడు బాలుని నైజమునకే యెక్కువ ప్రాముఖ్యతనిచ్చి అతని భావిజీవితమున కుపకరించు లక్ష్యమును తక్కువగా

గమనింపవలసి యుండును. తదుపరి తరగతులు హెచ్చినకొలది క్రమేణ బాలుని నైజమునకు ప్రాముఖ్యత తగ్గించుచు, భావి జీవితమునకు సిద్ధపరచు లక్ష్యమున కెక్కువ ప్రాధాన్య మీయ వలయును. కావున ప్రణాళికను సిద్ధపరచుటయందీపైన చర్చింపబడిన జీవిత సంసిద్ధతా సూత్రమునుగూడ గమనింపవలసి యుండును.

(4) కార్యాచరణ సూత్రము (Principle of activity):- బాలునియందు స్వాభావికముగా నేదైన నొక పనిని చేయుటకు కాంక్షయుండును. ఇట్టి కార్యాచరణకాంక్ష అతని పుట్టుకతోనే యారంభించును. కావుననే బాలు డెల్లప్పుడు చురుకుగా నుండి యేదోయొక పనిచేయుట కుద్యుక్తుడై యుండును. ఈ చురుకుతనమే యతని వికాసమునకు మూలకారణము. ఇదియే యతనిని కార్యాచరణకు ప్రోత్సహించును. ఇట్టికార్యాచరణమువలననే బాలుని శారీరక, మానసిక శక్తు లభివృద్ధి జెందుచుండును. ఉదా:-ఒక బాలుడు బంతియాట (Foot-bal game) నేర్చుకొనుట కై ప్రారంభించు ననుకొనుడు. అతడు ఆయాట నియమముల నన్నిటిని పఠించె ననుకొనుడు. ఇంతియేగాక ఆ యాటయందారి తేరిన వారితోగూడ సంభాషించె ననుకొనుడు. కొంద రాడుచుండగా గూడ చూచినా డనుకొనుదము. అతడొక బంతినిగూడ కొనె ననుకొందము. ఇవన్నియు జరిగినప్పటికి అతడు 'బంతియాట' నాడజాలడు. ఎంతవరకు అతడు స్వయముగా మైదానములోనికి దిగి వాస్తవముగ నాడుట మొదలిడడో అంతవర కతడు ఆయాట నేర్చుకొనజాలడు,

అట్లు స్వయముగా నాడిననేగాని అతని కాయాటయందు నిపు ణత్వ మేర్పడజాలదు. ఇట్టి స్వయంకృషి ( Self-activity )యే బాలుని శారీరక శక్తుల నెక్కువ నభివృద్ధి పరచును.

ఇదేవిధముగా ఒక బాలుడు 'ధైర్యము'ను గురించి చదువ వచ్చును. ధైర్యముయొక్క అర్థమును బాగుగ గ్రహింప వచ్చును. ధైర్యసాహసములు చూపిన కొందరు వ్యక్తులతో స్నేహ మేర్పరచుకొనవచ్చును. కాని అతడు స్వయముగా నెంతవరకు సాహసకృత్యములను చేయుటకు మొదలిడడో, అంత వర కతడు ధైర్యవంతుడు కాజాలడు. కాబట్టి మానసికశక్తుల అభివృద్ధికిగూడ స్వయంకృషియే ముఖ్యము. విద్యాప్రణాళిక నిర్మాణమునందు బాలుని స్వయం కృషి కవకాశములను గల్పించు విషయములను ( Subjects ) చేర్చుట యత్యవసరము.

కనుకనే విద్యాప్రణాళిక కృషి ( Activity ) స్వానుభవ ములకు సంబంధించినదై యుండవలయునేగాని కేవలము సాధింప వలసిన జ్ఞానము, సమకూర్పదలచిన యంశములకు జెందినదై యుండకూడదు. ఈ కారణమును బట్టియే విద్యాప్రణాళికా నిర్మాణమునందు కార్యాచరణ సూత్రమునకు ప్రాముఖ్యత నియ్యవలసి యుండును.

పాఠశాల బాలురకు కొంత జ్ఞానమును సమకూర్చుస్థాన ముగా నుండక బాలురకు కొన్ని వివిధచర్య ( Activities )లందు క్రమశిక్ష నిచ్చునదిగా నుండవలయును. ఈ చర్యలు ప్రపంచ మునం దెక్కువ ప్రాముఖ్యత చెందియుండవలయును. ఇట్టి

చర్యలు రెండు విధములు. మొదటివిధము:—వ్యక్తి పరిమాణము (Standard) ను, అతని సాంఘికజీవిత పరిమాణమును భద్రపరచుటకు తోడ్పడు చర్యలు. ఉదా :—శరీరారోగ్యమును కాపాడుకొనుట, శారీరక సౌష్టవము, మంచినడత, మతము, నీతి మొదలగునవి, రెండవవిధము:—సృష్ట్యాత్మక చర్యలు. ఉదా :—శాస్త్రపరిశోధనలు, కావ్యరచనలు, గానాభ్యసనము, వివిధకళాకౌశలము మొదలగునవి. ఇవియే నాగరికతకు మూలము. కావుననే పాఠశాల విద్యాప్రణాళికయం దీ చర్యలు (Activities) అన్నియు చేర్పపడవలసి యుండును.

(19)

# పన్నెండవ అధ్యాయము



# విషయముల తార్కిక, మానసిక క్రమము

## (Logical and psychological order of Studies)

బాలురకు బోధింపదలచిన విషయమును తార్కిక క్రమమునందైనను లేక మానసిక క్రమమునందైనను నమర్చవచ్చును. ఈ రెండు క్రమములందలి తారతమ్యములను తెలిసికొనుట యావశ్యకము.

(1) తార్కిక క్రమము (Logical order):—ఈ క్రమమునందు బోధింపబడు విషయమునకే ప్రాముఖ్యత ఇయ్యబడును. ఆ విషయమందలి వివిధభాగములు వానికిగల అన్యోన్య సంబంధముల ననుసరించి వరుసగా నమర్చబడి, ఆయాభాగములకు సంబంధించిన అన్నిసంగతులు సవిస్తరముగా చర్చింపబడును. ఉదా:—గణితము నేర్పుటయందు తార్కికక్రమ మిట్లుండును. బాలురకు మొదలు అంకెలను లెక్కపెట్టనేర్పి తరువాత లక్షలు, కోట్లవరకు వ్రాయుట నేర్పుట, దీనితరువాత సంకలనమును సంపూర్ణముగా నేర్పుట, అనగా లక్షలవరకు, పెక్కుపంక్తులు గలిగిన పద్దులను కూడునట్లుచేయుట, తదుపరి వ్యవకలనమును ఒకఅంకెతో ప్రారంభించి లక్షలు, కోట్లవరకు చేయించుట, ఆపిమ్మట గుణకారము, భాగహారములను క్రమముగా నేర్పుట.

ఇట్టి తార్కిక క్రమమునందు ముఖ్యముగా గమనింపబడు విషయమేమన ఏదైన నొక శీర్షికను తీసికొనినపుడు దానికి సంబంధించిన వివరములన్నిటిని క్రమముగా తెలుపబడును. ఈ క్రమమునం దొక శీర్షికను పూర్తిగా ముగింపనిదే రెండవ శీర్షిక తీసికొనబడదు. పై నుదహరింపబడిన ఉదాహరణములో గణితము నేర్పునపుడు సంకలనమునకు సంబంధించిన వివరములన్నియు పూర్తిగా ముగింపనిదే వ్యవకలనము తీసికొనబడదు. ఈ క్రమమునందు విద్యనభ్యసించు బాలున కెట్టి ప్రాముఖ్యత నియ్యబడదు.

పూర్వకాలమునందు బోధనయం దీక్రమమునే యవలంబించుచుండెడివారు. అప్పటి పాఠ్యగ్రంథములుకూడ నీక్రమము ననుసరించియే వ్రాయబడెడివి. గ్రంథకర్తలు తమ గ్రంథములం దీక్రమమునే ఎక్కువగా పాటించుచుండిరి.

(2) మానసిక క్రమము ( Psychological order ):—

ఈ క్రమమునందు బోధింపబడు విషయమునకు ప్రాముఖ్యత యియ్యబడదు. విద్యనభ్యసించు విద్యార్థి మానసికతత్వమే దృష్టియం దుంచుకొనబడును. విద్యనారంభించు విద్యార్థిని దృష్టియందుంచుకొని యతని మానసిక శక్తుల ననుసరించి, వానికి తగినట్లుగా విషయ మమర్చబడును. ఇట్లమర్చుటయందు బోధింపబడు విషయము పూర్తిగా తీసికొనబడక ఎంతవర కవసరమో యంతవరకే తీసికొనబడును. ఉదా:-గణితమును మానసిక క్రమపద్ధతి ప్రకారము బోధించుటకై ఉపాధ్యాయుడు బాలురకు మొట్టమొదట ఇరువది అంకెలను చదువుట,

వ్రాయుట నేర్పును. ఆ యంకెలను చదువుట, వ్రాయుట నేర్పు నపుడే సంకలన వ్యవకలన భావములను బాలుడు గ్రహించునట్లు చేయును. తరువాత నూటివరకు నంకెలను నేర్పి వాని నుపయో గించి సంకలన, వ్యవకలన, గుణకార, భాగహారముల నేర్పును. ఈ నాలుగు పద్ధతుల నేర్పునపుడే వివిధమానములు, చిన్న చిన్న భిన్నములుగూడ నేర్పబడును. ఈ క్రమమే చరిత్ర, భూగోళము మొదలగు నితర పాఠ్యవిషయములందు గూడ నవలంబింప వచ్చును.

బోధన సల్పునపుడు ఉపాధ్యాయుడు బాలుడు, విష యము ( Subject ) ఈ రెంటిని ముఖ్యముగా గమనింప వలసి యుండును. అనగా పాఠ్యవిషయములను సక్రమముగా పూర్తి చేయుట, బాలుని నైజము ననుసరించి బోధించుట, ఈ రెండు విషయములపై యతనిదృష్టి కేంద్రీకరించి యుండవలయును. అతడు విషయమునకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చిన తార్కిక క్రమము నవలంబించిన వాడగును. అట్లుగాక బాలునినైజము నకే ప్రాముఖ్యతనిచ్చిన మానసిక క్రమము నవలంబించిన వాడగును. మానసికక్రమము నవలంబించినపుడు విషయము నందలి కొన్ని స్వల్పభాగములనుకూడ వదలి వేయవలసి యుండును.

సామాన్యముగా కొందరు బోధించు విషయమును సంపూర్ణముగ ప్రదర్శించిననేగాని యది బాలుర మనస్సునకు నచ్చదని చెప్పుదురు. ఇట్లు చెప్పుట సరియైనది కాదని చెప్ప వచ్చును. ఎందువల్ల ననగా తార్కికక్రమము వలన బాలురకు

కొంత విషయజ్ఞానము లభించినను వారు దాని నుపయోగింప జాలరు.

తార్కికపద్ధతి నుపయోగించుటవలన బోధనయందు తక్కువకాలము పట్టవచ్చునుగాని దానివలన ఫలితములు తృప్తికరముగ నుండవు. మానసిక క్రమమునం దట్లుగాక బాలుని నైసర్గికశక్తుల వికాసమునకు తగిన యవకాశములు లభింపజేయ బడును. కావున దానివలన మంచిఫలితములు లభించును.

మానసిక క్రమమువలన బాలుడు తాను నేర్చుకొనిన విషయమును బాగుగా నవగాహన చేసికొనును. ఇట్టి జ్ఞానము వలన నిత్యజీవితమునందు సామాన్యముగా నెదుర్కొనవలసిన సమస్యలను సులభముగా బాలుడు పరిష్కరింప సమర్థుడగును. కాబట్టి ఎల్లప్పుడు బాలుని స్వానుభవములనే బోధనా కేంద్రముగ జేయుటయే సరియైన పద్ధతి యగును.

చిన్న తరగతులయందు తార్కిక క్రమము నుపయోగింపక మానసిక క్రమమునే యుపయోగింపవలయును.

దీనినిబట్టి తార్కిక క్రమము నిరుపయోగమైనదని భావించుట తగదు. మనము సంపాదించునట్టి జ్ఞానానుభవముల నొక క్రమపద్ధతియందు సమర్చి యుంచవలసిన యవసర ముండును. కావున తార్కిక క్రమముగూడ ముఖ్యావసరమే.

తార్కిక క్రమముతోనే బోధనను ప్రారంభించుట యుక్తముకాదు. కాని బోధనాంత్యమునందు దీని నుపయోగింపవలసి యుండును.

మానసిక క్రమము చిన్నవయస్సులోని బాలుర బోధన మునకే యుపయోగింపవలసి యుండును. వారియందు కొన్ని భావన (Concepts) లేర్పడిన తరువాత బోధనయందు తార్కిక క్రమము నవలంబింపవలసి యుండును.

దీనినిబట్టి తేలిన సారాంశ మేమన యుపాధ్యాయుడు ఈ రెండు క్రమములలో నొకదానిని పూర్తిగా వదలి రెండవ దానినే పూర్తిగా నుపయోగించిన యెడల నతడు బాలురకు నష్టము కలుగజేసినవా డగును. అట్లుగాక తన బోధనయందు తార్కిక, మానసిక క్రమముల రెండింటిని మిశ్రపరచవల యును. వీనిని వేరు వేరుగా భావింపక, బోధనారంభమును మానసిక క్రమముతోను, అంత్యమును తార్కిక క్రమము తోను చేయవలయును. అనగా ఉపాధ్యాయుడు తాను బోధించు విషయమును మానసిక క్రమమునం దమర్చుటయే కాక దానిని తార్కిక క్రమమునం దుండునట్లుగా గూడ చూడవలయును. ఇట్లు సల్పిన బోధన ఫలవంతమగు ననుటలో సందియ మెంతమాత్రము నుండనేరదు. ఉదా:- ఆఱవతరగతి బాలురకు 'శాతము'ను గురించి బోధింప దలచినపుడు ఉపా ధ్యాయుడు 'శాతమనగా 100 హారముగాగల ఒకభిన్నము' అని నుడివి, $\frac{1}{2}$, $\frac{3}{4}$ మొదలగు భిన్నములను శాతములలోనికి మార్చు మనుట, తదుపరి 450 యొక్క 15 వ శాతమెంత కనుగొను మనుటయు, తార్కిక క్రమము ననుసరించి 'శాతము'ను గురించి బోధించుట యగును. ఇట్టి తార్కిక క్రమము పాఠ్యా రంభమున సమంజసము కాదు.

అట్లుగాక యిదే పాఠమును ఈ క్రింది మానసిక క్రియ ముతో ప్రారంభింప వలయును. ఉదా:- మొదలే శాతమన నేమో నిర్వచింపక, బాలురకు తమ నిత్యజీవితమునందు శాత మునొక్క అవసరము ఏయే సందర్భములలో కలుగునో వారి మానసికశక్తులను రెచ్చగొట్టు కొన్ని ప్రశ్నలద్వారా సూచింప వలయును. "సాధారణముగ పరీక్షలలో బాలుడు పొందిన గుణ ములు నూటికి ఇన్నియని కనుగొనబడుటకు కారణమేది ? ఒక బాలుడు చరిత్రలో 70 గుణములకు 30 గుణములను, మరియొక బాలుడు 50 గుణములకు 20 గుణములను పొందినాడనుకొనుడు. వీరిద్దరిలో నెక్కువ గుణములను పొందిన దెవరో సులభముగా కనుగొను టెట్లు?" గుణముల మొత్తము సంఖ్య 70 లేక 50 వేరువేరుగా నుండక ఒకే మొత్తము 100 గా నుండిన యెడల ఎవరి కెక్కువ గుణములు వచ్చినది సులభముగా గ్రహించు టకు వీలుండునని సూచింపనగును. బాలురను 25%, 30% లలో ఏది ఎక్కువయని ప్రశ్నించిన వారు వెంటనే సమాధానము చెప్పుదురు. కాని 70 లో 30, 50 లో 20, ఏది ఎక్కువ యనిన వారికి చెప్పుటకు కొంత చిక్కు కలిగి ఆలోచన చేయవలసియుండును. ఇదేవిధముగ 'వ్యాపారమందు 000 రూపాయలు పెట్టుబడి పెట్టుటచే 360 రూపాయలు లాభము, 2400రూపాయలు పెట్టుబడిపెట్టుటచే 250రూపాయలు లాభము వచ్చిన ఏ వ్యాపారమందు లాభ మెక్కువ వచ్చినది?' ఇట్టి సమ స్యలను పరిష్కరించుటకై 100 ను ప్రమాణముగా తీసికొని పోల్చవలసిన యావశ్యకత గలదని బాలురు తెలిసికొనునట్లుగా

జేసి, శాతముయొక్క అవసరమును, దానిప్రాముఖ్యతను బాలురు గ్రహించునట్లు చేయవలయును. ఇదియే మానసిక క్రమమున పాఠము నారంభించుట యనబడును.

ఈ పై విధముగ పాఠమును ప్రారంభించిన తదుపరి శాతమన 100 హారముగాగల ఒకభిన్నమనియు, $\frac{1}{2}$, $\frac{3}{4}$, $\frac{1}{3}$ మొదలగు భిన్నములను శాతములనుగా మార్చ్చమనుటయు: 450 యొక్క 15 వ శాతము, 360 యొక్క 20 వ శాతము, మొదలగు సమస్యలను పరిష్కరింపుమనుటయు, వ్యాపారమునందు లాభనష్టముల శాతమును కనుగొనుట, మొదలగు తార్కిక క్రమము ననుసరించిన సమస్యలను బాలురచే పరిష్కరింప జేయవలయును. ఈ విధముగ పాఠమును మానసికక్రమముతో నారంభించి తార్కిక క్రమమున బోధించుచు ముగించుట స్వాభావిక సిద్ధమని చెప్పవచ్చును.



## పదమూడవ అధ్యాయము

# పాఠ్యవిషయముల అన్యోన్యసంబంధము

# (Correlation of School - Subjects)

విద్యాప్రణాళికయందలి వివిధ విషయములు బాహ్య దృష్టికి గోచరించినంత వేరువేరుగా నుండవు. దీనికి కారణమే మన జీవితమందలి వివిధశాఖలతో వానికి సన్నిహిత సంబంధ ముండుటచే వానియందు పరస్పర సంబంధమేర్పడి యుండును. బాలుడేదైన ప్రపంచికానుభవమును పొందునపుడు తాను వివిధ విషయములందు ( Subjects ) సంపాదించిన జ్ఞానమును దాయమునువీలునుబట్టి యుపయోగించుకొనుచుండును. ఉదా:- క్రీడ, వ్యాయామము, పర్యటనమందు బాలుడు తాను ఒక ప్రత్యేక విషయమునందు ( Subject ) సంపాదించిన జ్ఞానమును మాత్రమే యుపయోగింపక వివిధ విషయములందు దానార్జించిన జ్ఞానమును అవసరముకొలది నుపయోగించును. కాబట్టి బోధనయందు పాఠ్యవిషయములందు గల అన్యోన్య సంబంధ ములను తప్పక గమనింపవలసియుండును.

పూర్వకాలమునందు నుపాధ్యాయులు బోధించునపుడు పాఠశాలలలోని పాఠ్యవిషయముల అన్యోన్య సంబంధములను దృష్టియందుంచుగొనెడివారు కారు. వారు వ్రాతవ్రాత, పఠనమును, వేరు వేరు విషయములనుగా భావించి వేరు వేరు

గంటలలో బోధించెడివారు. ఇదియుంగాక వ్యాకరణము, వ్యాసరచన, నోటిలెక్కలు, వ్రాతలెక్కలను బోధించుటకై కాలనిర్ణయ పట్టికయందు వేరు వేరుగనే యేర్పాటుచేసెడి వారు. చరిత్ర, భూగోళములకు ; భూగోళ, ప్రకృతి పఠనము లకు ; లెక్కలు, బీజగణితమునకు నుండునట్టి పరస్పర సంబంధమును గమనించెడివారు కారు. ఈ విధముగా ఒకేవిషయము నకు ( Subject ) జెందిన వివిధ భాగములను వేరు వేరుగా తీసికొని వానికి గల సంబంధమును గోచరించునట్లు చేయక బోధించుట వలన బోధనయందు బాలుర కభిరుచి తగ్గి విషయ ములు వారికి సరిగా అవగాహన కాకపోవుచుండెను.

బోధింపబడు విషయమునకు, బాలుని జీవితమునకు గల సంబంధమును గూడ విశదీకరింపబడక పోవుటచే పిల్లలకు పాఠ ములం దభిరుచి కలుగక పోవుటయే గాక వారల కవి కఠిన ముగా దోచుచుండెడివి. ఇట్టి లోపములను నివారించుటకే విషయముల అన్యోన్యసంబంధసూత్ర మేర్పాటు చేయబడి నది. దీనివలన బాలురకు చాల లాభములు గలవు.

అన్యోన్య సంబంధ సూత్రమువలన లాభములు :—

(1) దీనివలన విషయముల ( Subjects ) సంఖ్య తగ్గును.

ప్రాథమిక పాఠశాలయం దీ సూత్రమును దృష్టియం దుంచు కొనక పోవుటవలన బోధించునట్టి విషయముల సంఖ్య చాల యెక్కువగు చుండును. ఉదా :- మాతృభాషయందు చదు వుట, వ్రాయుట, మాటలాడుట, పద్యమును చదువుట

వ్యాకరణము, వ్యాసరచన మొదలగునవి. లెక్కలయందు ఎక్కములు, నోటిలెక్కలు, వ్రాతలెక్కలు మొదలగునవి యెన్నియో విషయములుగా ( Subjects ) కనబడును. వీని నన్నిటికి కాలనిర్ణయ పట్టికయందు వేరువేరు స్థానముల నిచ్చి బోధించుట తప్పుపద్ధతి యని యాధునిక విద్యావేత్తలు బాగుగ గమనించి యున్నారు.

విషయముల సంఖ్య ఈ విధముగ హెచ్చుటవలన కాలనిర్ణయ పట్టికయందు వీనికి అవకాశము కూడ లభింపదు. నోటిలెక్కలను, వ్రాతలెక్కలనుండి విడదీయుట సమంజసము కాదు. ఇట్లు పరస్పర సంబంధము గలవానిని వేరువేరు గంటలలో బోధించుట తగదు. అన్యోన్య సంబంధసూత్రము నవలంబించినచో ఒకవిషయము ( Subject ) నకు సంబంధించిన వివిధాంతర్భాగములకు కాలనిర్ణయ పట్టికలో వేరేతావు నియ్యవలసిన అవసరముండదు. కావున ఈ సూత్రమువలన కలుగు లాభము పాఠశాలయందు బోధించునట్టి విషయముల సంఖ్య తగ్గుటయే. ఉదా :- ఎక్కములను నేర్పుటకై వేరుగంట నేర్పాటుచేయక నోటిలెక్కలను చేయించునపుడే బాలురకు సందర్భానుసారముగ ఎక్కములను నేర్పుట యుక్తము. ఇదే విధముగా మిగిలిన అంతర్భాగములను గూడ అవసరమున్న చోట బోధింపవలయును.

2. ఈ సూత్రము వలన బోధన కల్పితమైనదియు, నిర్జీవమైనదియు గాకుండును. విషయములందుగల పరస్పర సంబంధములను గుర్తింపక వానిని వేరువేరుగా తీసికొని బోధిం

చుట వలన బోధన నిర్జీవమైపోవును. ఇతర విషయములలో గ్రహించిన అంశములను, బోధించు విషయమునందలి యంశములతో సంబంధ పరచనియెడల నా విషయము బాలురకర్థముగాకుండును. ఉదా :- భూగోళశాస్త్రమును బోధించునపుడు బాలురు క్రింది తరగతిలో ప్రకృతి పఠనమునందు వర్షము, నదులు, కాలువలను, గురించి నేర్చుకొనిన విషయములతో సాయము తీసికొనక పై తరగతియందు నదులు, వాని ఫలితములు, ఆర్థిక లాభములను గురించి బోధించుట చాల కష్టసాధ్యమగును. ఇదేవిధముగా బీజగణితమును లెక్కల నుండి వేరుపరచి బోధించుటవలన అపారమగు నష్టము సంభవించును. అన్యోన్య సంబంధసూత్రమును పాటించుటవలన ఇట్టి నష్టములు కలుగనేరవు.

3. <u>అన్యోన్య సంబంధ సూత్రమును పాటించుటచే పాఠశాలలో విద్యాగరపు నుద్దేశమునం దేకత్వ మేర్పడును:—</u> అన్యోన్య సంబంధ సూత్రమును పాటింపక పోవుటవలన ప్రతి ఉపాధ్యాయుడు తాను బోధించు విషయమునే దృష్టియందుంచుకొని దానిని బోధించు నుద్దేశమునే విద్యాగరపుటకు ముఖ్యోద్దేశముగా భావించును. ఈ విధముగ వివిధవిషయములను ( Subjects ) బోధించు నుపాధ్యాయులు భావించిన యెడల పాఠశాలలో విద్యాగరపు నుద్దేశము లనేకములుగ నుండును. ఇట్లు భావించుటవలన విద్యయొక్క ముఖ్యోద్దేశము మరుగుపడి పాఠశాలయందు విద్యాగరపు నుద్దేశమునం దేకత్వముండక భిన్నత్వ మేర్పడును. అన్యోన్య సంబంధ సూత్రమును

పాటించి విషయములను బోధించిన యెడల వేరువేరు విద్యోద్దే శము లేర్పడక ఒకే యుద్దేశ మన్నిటియందు కానుపించును. ఇదియే ఈ సూత్రమునవలన కలుగు మరియొక లాభము.

అన్యోన్య సంబంధముయొక్క విధములు :— విషయములందు ( Subjects ) గల అన్యోన్య సంబంధము ఈ క్రింది నాలుగు విధములుగా నుండును.

(1) ఒక విషయమునకు ( Subject ) పాఠశాల యందలి విద్యాప్రణాళిక యందలి యితరవిషయములకు గల సంబంధము.

(2) ఒక విషయము దాని వివిధశాఖలకు గల పరస్పరాను సంబంధము.

(3) ఒక విషయమునందలి ప్రత్యేక భాగము, దాని యంతర్భాగములకు గల సంబంధము.

(4) ఒక విషయమునకు బాలుని జీవితమునకు గల సంబంధము.

ఈ నాలుగు విధములైన అన్యోన్య సంబంధమును గణితశాస్త్రమును ఉదాహరణముగా తీసికొని వివరించుదము.

I గణిత శాస్త్రమునకు పాఠశాల ప్రణాళికయందలి యితర విషయములకు గల సంబంధము. గణితమును బోధించునపుడు విద్యాప్రణాళికయందలి యితర విషయములు ( Subjects ) అనగా భూగోళము, ప్రకృతిపఠనము, సైన్సు

మొదలగు వానికి గణితశాస్త్రమునకు గల సంబంధమును తేట తెల్ల మగునట్లుగా బోధింపవలయును.

II గణిత శాస్త్రమునందలి వివిధశాఖలకు గల పరస్పర సంబంధములను గమనించుట. లెక్కలు, బీజగణితము, రేఖా గణితము ఇవి గణిత శాస్త్రమునందలి ముఖ్యశాఖలు. గణిత బోధనయం దీశాఖలకు గల అన్యోన్య సంబంధమును బాలురు గుర్తించు నట్లుగా నుపాధ్యాయుడు చేయవలెను. అనగా ఒక శాఖ మరియొక శాఖకన్న వేరుగా నుండు నను భావము బాలురయందు గలుగనివ్వక వానికి గల పరస్పర సంబంధములను విశదపరచ వలయును.

III గణితశాస్త్రమునందు ఏ ప్రత్యేకశాఖ తీసికొన బడునో యా ప్రత్యేక శాఖయందలి యంతర్భాగములకు గల అన్యోన్య సంబంధమును వెలిబుచ్చుట. ఉదా :— లెక్కలను బోధించునపుడు సంఖ్యలు, కారణాంకములు ( Factors ), గ. సా. ప్ర. ( G. C. M. ), క. సా. గు. ( L. C. M. ) భిన్నము, దశాంశ భిన్నములు మొదలగు వానిని వేరువేరుగా బోధింపక, వానికిగల పరస్పర సంబంధమును సూచించుచు బోధింపవలయును.

VI గణితశాస్త్రమునకు బాలుని జీవితమునకు గల సంబంధము. గణితమును బోధించునపుడు అది బాలుని నిత్య జీవితముతో నెట్టి సంబంధము కలిగియుండునో విశదపరుపవలసి

యుండును. ఉదా :— భిన్నమును గురించి బోధించునపుడు 'ఒక పండును నలుగురు బాలురు సమముగా పంచుకొన దల చిన ఒక్కొక్కరికి వచ్చు భాగమెంత ? ఒకడు దినమంతయు పనిచేసిన 3 రూపాయలు సంపాదించిన ఒకపూట పనిచేసి యున్నచో అతడెంత సంపాదింపగలుగును ? ఒక రూపాయకు 4 శేర్లు ధాన్యమువచ్చిన నాలుగుఅణాల కెంతధాన్యము వచ్చును ?' మొదలగు నిత్యజీవితమునకు సంబంధించిన సమస్య లను పరిష్కరించుటలో భిన్నముయొక్క అవసరమును బాలు రకు సూచింపవలయును.

పాఠశాలయందు ప్రతివిషయము ( Subject ) నం దీనాలుగు విధములైన అన్యోన్య సంబంధములను దృష్టియం దుంచుకొనవలసి యుండును. ఇట్లు చేయుటవలన బాలురు పాఠముల నెక్కువ ఆసక్తితో నేర్చుకొనుటయేగాక తాము సంపాదించిన జ్ఞానమును గూడ నుపయోగింప సమర్థులగుదురు.

అన్యోన్యసంబంధ సూత్రమును దృక్పథమునం దుంచు కొని బోధింపుమనిన మాత్రమున సహజముగా సంబంధము లేకున్నను ఏదియో కల్పిత సంబంధమును బలవంతముగా నేర్ప రచి బోధించుట యుక్తముగాదు. ఉదా :— హిందూదేశ చరిత్రయందు 'కురుక్షేత్రమున జరిగిన మహాభారత యుద్ధము' ను తెలుపు సందర్భమున బాలురచే ఆ యుద్ధమునకు ఎంత వ్యయమైనదో ? ఎన్ని ఏనుగులు, గుఱ్ఱములు నశించినవో ? ఎందరు సైనికులు మరణించిరో ? మొదలగు సమస్యలకు

సంబంధించిన లెక్కలను చేయించి, చరిత్రతో గణితమునకు, అన్యోన్య సంబంధ మేర్పరచుటకై ప్రయత్నించుట, బలవంతముగా కల్పిత సంబంధము నేర్పరచి బోధించుట యగును. అట్లుగాక 'కురుక్షేత్రము' హిందూదేశమున నెచ్చటనున్నదో ? దాని నైసర్గిక పరిస్థితులెట్టివో ? తెలిపి భూగోళమును చరిత్రతో సంబంధపరచుట యుక్తమగును.

# Glossary of Technical Terms

## పారిభాషికపదావళి

Acquirement = సంపాదనము

,, of Appreciation = గుణగ్రహణ శక్తి సంపాదనము

,, of Knowledge = జ్ఞాన సంపాదనము

,, of Skill = నిపుణత్వ సంపాదనము

Adjustment = అనుగుణ్యము

Adjustment to Life = జీవితానుగుణ్యము

Aim = ఉద్దేశము

Aim of Education = విద్యోద్దేశము

,, of Adjustment to Life = జీవితానుగుణ్యోద్దేశము

,, of Earning of Livelihood = జీవనోపాధిగడించు ఉద్దేశము

,, of Preparation for Complete Living = సంపూర్ణ జీవితమునకు సిద్ధపరచు ఉద్దేశము

Aim Moral = నైతికోద్దేశము

Aim Social = సాంఘికోద్దేశము

Animate = చేతన

Application = అభ్యాసము

Assignment = నియమితకార్యము

Biological view point = జీవశాస్త్రదృక్పథము

Checks = పై చూపులు
Child study = శిశుత్వ విచారము
Concept = భావన
Comparison = పోల్చుట
Correction = సవరణ
Correlation = అన్యోన్యసంబంధము
Creative ability = సృష్ట్యాత్మక శక్తి
Development = వికాసము
Democratic Society = ప్రజాస్వామిక సంఘము
Devices of Teaching = బోధనోపకరణములు
Educational Agency = విద్యాసంస్థ
Factors = ముఖ్యాంగములు
Formulation = సూత్రీకరణము
Group work = సమష్టికార్యము
Hand-craft = చేతిపని
Illustration = వివరణము
Imagination = కల్పన
Imitation అనుకరణము
Inanimate = అచేతన
Individual work = వ్యక్తికార్యము
Logical Order = తార్కికక్రమము

Manual Skill = హస్తకౌశలము
Maxim = సూక్తి
Model = మాదిరి
Nature = స్వభావము, నైజము
Nature study = ప్రకృతిపఠనము
Natural setting = సహజవాతావరణము
New Teaching = ఆధునికబోధన
Organism = సజీవము
Physical Configuration = భౌతికస్వరూపము
,, Science = భౌతికశాస్త్రము
Practice = అభ్యాసము
Preparation ప్రారంభము, సిద్ధపరచుట
Presentation = ప్రదర్శనము
Principle = సూత్రము
Principle of Activity = కార్యాచరణ సూత్రము
,, of Definite Aim = ముఖ్యోద్దేశసూత్రము
,, of Division = విభజనసూత్రము
,, of Interest = అభిరుచిసూత్రము
,, of Linking with Life = జీవితానుసంధాన సూత్రము
,, of Practice & Revision = అభ్యాస పునరావృత్తిసూత్రము

Principle of Selection = ఎన్నికోలుసూత్రము
,, of Conservation = భద్రతాసూత్రము
,, of Creativeness = సృష్ట్యాత్మకసూత్రము
,, of Preparation for Life = జీవితసంసిద్ధతా సూత్రము

Problematic Act = సందిగ్ధకార్యము
Process = విధానము, సరణి
Profession = వృత్తి
Psychological Order = మానసిక క్రమము
Reasoning = హేతువాదము
Self-activity = స్వయంకృషి
Socialisation = సాంఘికభావోత్పత్తి
Specialist = ప్రత్యేకోపాధ్యాయుడు
Standard = ప్రమాణము
State = ప్రభుత్వము
Subject = విషయము
Supervision = పర్యవేక్షణము
Value = మూల్యము
Value Educational = విద్యామూల్యము
,, Cultural = సంస్కృతిమూల్యము

Value Conventional = సభామూల్యము

,, Farmal = శిక్షణామూల్యము

,, Instrumental = సహాయమూల్యము

,, Moral = నైతికమూల్యము

,, Introductory = పరిచయమూల్యము

,, Knowledge = జ్ఞానమూల్యము

,, Practical = ఆచరణమూల్యము

,, Social = సాంఘికమూల్యము

,, Utilitarian = ప్రయోజనమూల్యము

Vocal Music = గాత్రపుపాట